శ్రీ సాయిలీలా ప్రచురణములు. 1
మొదటికూర్పు- 1957
రెండవకూర్పు- 1962





శాస్త్ర గురు బోధలను మఱి స్వానుభవము
కలిమి నెద్దాని నరుఁ డేడుగడఁగ నమ్ము
నదియె శ్రేష్ఠంబుఁ బరమమౌ నదియు; యదె- ఐ
గంబునఁ వాని కవలంబనంబు; సాయి!

ఓం

శ్రీ సాయీ సద్గురవే నమః

# శ్రీ సాయీబాబా

పూజా స్తవములు.





రచయిత:

బాపట్ల హనుమంతరావు

శ్రీ సాయీ కుటీరము

చిన్నగంజాము. (గుంటూరుజిల్లా)

పూజా స్తవంబు లమృతపు
భోజనములు, సకల సుజన పురుషార్థ శ్రీ
భాజనములు, దైవత నీ
రాజనములు, శాంతి భక్తిరస వీజనముల్.

చీరాల,
11-7-62.

బందా ఆదినారాయణ.

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
సమర్థ సచ్చిదానంద భగవాన్ సాయి సద్గురు॥



కర్మ ధూమపత్రింబులఁగాల్చు "చిలుము"
శత్రు [illegible] భయంబాపఁజాలు "సటక"
ఐహికార్థ సిద్ధిఁగూర్చు "భిక్షపాత్ర"
శరణమిడు 'పాదుకల' నెంతు; సాయిదేవ!

ఓమ్

శ్రీ సాయీ ప్రపన్న!

# ప్రార్థన

సాకారుండవో! లేక ని
రాకారుఁడవో! మఱేమి యగుదువో! యెఱుఁగ
నాకగునె? శ్రితుఁడ, జడుఁడను
సాకవె! నీ కరుణఁబఱపి సాయీనాథా!

సందేహము లడఁపవె! నీ
యందున నేకాంతభక్తి నందింపవె! ని
న్నెందేమఱనీకవె! యఘ
సందోహ మడంపఁగదవె! సాయీనాథా!

చేయఁదగని పనులుచేసితి నెన్నియొ;
చేయఁదగినవానిఁ జేయనైతిఁ;
కృపణుఁడైన నాకు నిఁక వేఱుగతిలేదు;
కరుణఁబఱపి ప్రోవఁగదవె! సాయి!

శ్రీ సాయీసమర్థ!

శ్రీ సాయిబాబా పూజా స్తవములు

## విషయ సూచిక

పుటలు





చి॥ శ్రీ కర్రి మునిరెడ్డి.



చి॥ శ్రీ పాదిల విశ్వనాథశర్మ.
(S. ఇల్లిందలపఱ్ఱు, పశ్చిమగోదావరి జిల్లా)

తమ్ముఁ డీతండు; — ఆత్మబాంధవుఁ డీతండు;
పలికి చిఱునవ్వు వెలిఁబుచ్చు వాఁ డితఁడు— చిఱునగవు ముందుగాఁగ భాషించు నితఁడు
'ప్రేమ' యుగళరూపమున నావిర్భవించె!

# ప్రశంస - ఆశీస్సులు

ఊర్జిత సాత్త్వికప్రకృతి, నుత్తమ సద్గుణశీల వృత్తి, న్యా
యార్జిత భాగ్యభోగ విభవాప్తిం, బరేశ్వరభక్తి యుక్తి, న
త్యార్జవ ధీ వదాన్యకృతి, నైక్యమతిన్, హిత బంధుసక్తిం, గృ
ష్ణార్జునులో యనంగ నలరారుదు రిద్దరు నిత్య తుష్టులై.

తలంపులన్ వాక్కులందుం గృత్యంబులందుం
గలసి మెలసియుండుట మాత్రకాదు; - వీరి
పంటభూములు - గృహములు - పసుల కొట్ట
ములును సన్నిహితంబులై పొలుచు నౌర!

ముని రెడ్డి యన విశ్వనాథుండితండొప్పన్ విశ్వనాథుండనన్
ముని రెడ్డౌనన - బావయున్ మఱంది పెంపున్ గల్గి వర్తించు వీ
రిని ని వీరల వంశ సంజనితులన్ బ్రేమాస్పదైక ప్రవృ
త్తిని, సంపత్తులం గూర్చి ప్రోవవె! దయాబ్ధీ! సాయినాథప్రభూ!

ఇరువురు నీ పదాంబురుహ భృంగము, లిర్వురు నీ విలాస వి
స్ఫురిత కథా సుధాస్వదన మోదితచిత్తులు, ప్రేమపూర్ణు, లి
ర్వుర, సకలార్థముల్ తర తరంబుల వీరి కనుగ్రహించి, స
చ్చరితులం జేయంగాంగదవె! సాయిప్రసన్న! సమర్థసద్గురూ!

# పరిచయము

ఈ గ్రంథము పునర్ముద్రణావశ్యకత నొందుటలో రసజ్ఞులగు భక్తవరులకు ఎంత ప్రియమొప్పిన – రచనపైనుంగల ఆదరాభిమానములు సువ్యక్తము లగుచున్నవి. గ్రంథస్థమగుచున్న వస్తువునకుంగల మహాప్రాశస్త్యమునుగూర్చి వేఱుగఁ జెప్పవలసిన దేమున్నది? ఈ గ్రంథము శ్రీ సాయినాథుని భక్తులకు నిత్య పారాయణగ్రంథము కాఁ దగుటలో సందేహము లేదు.

ఐహికములను సర్వమును త్యజించి శ్రీ [illegible] హానుమంతరావుగారు తన జీవిత సర్వస్వమును శ్రీ సాయిబాబా పాదములకడ నుంచి సమాగతభక్తుల సేవను నొనరించుచున్నారు. సంసారాబ్ధిలో నీదుగాని– అంతుగాని లేక మథనపడుచున్నవారి కిది మార్గదర్శకము. అయిదేండ్లనుండి వారి కృషిని గమనించుచున్నాను. ఎట్టి అవరోధములను సరకుసేయక శ్రీ బాబాసేవకు తమ జీవితమును, శక్తిని అంకిత మొనర్చుకొన్న శ్రీ హానుమంతరావుగారు కడు ధన్యులు.

వారి భక్తిప్రపత్తులకు– కవితా వైదుష్యమునకు ఈ గ్రంథ పునర్ముద్రణమే బహువిధ తార్కాణము. తొలిముద్రణములో లేని యితరవిషయములను– ముఖ్యముగా "సహస్ర నామావళి"– ఇత్యాదులు చేర్చుటవలన సాయి భక్త [illegible]పుల కీ గ్రంథ మెంతటి యుపకారకమో తెలుపనవసరము లేదు. 'షిర్డి' లో శ్రీ సాయినాథుని [illegible]

సేవలను "త్రికాలసేవ" శీర్షికక్రింద రాగ తాళ బద్ధములగు కీర్తనల నొనర్చి మరాఠిగాని హిందీగాని తెలియని మముబోంట్లకు అపారమగు సత్కృతి నొనర్చినారు.

శ్రీ బాబాపై నింకను అపారములగు గ్రంథములను ఆంధ్రభాషలో రచించి భక్తజనుల కుపకరించి తద్ద్వారమున భగవత్సేవ నొనరించుటయే వీరి ధ్యేయము. వీరుకోరు ప్రతిఫల మీావణ్మాత్రము లేదు. వీరి భక్త్యావేశము కవితా వైదుష్య ములను భక్తజనులు సద్వినియోగ మొనర్చుకొందురని ఆసిం చుచున్నాను. వారికోటి నిస్కాములు లభించుట అరుదు.

శ్రీ బాబా వారి కరుణాకటాక్షవీక్షా ప్రసార మెల్లవేళ లను వీరికిఁ గలుగుఁగాక! ఈ గ్రంథమున ప్రథమముద్రణము నకు 'తొలిపలుకు' వ్రాయు భాగ్యమేగాక పునర్ముద్రణమునకు 'పరిచయ వాక్యముల' ను వ్రాసి, ప్రచండభాస్కరుని దీపపు వెలుఁగుతోఁ జూపించు మహద్భాగ్యమును గలుఁగజేసిన శ్రీ హనుమంతరావు గారికి, వారి "సాయీకుటీరము" నకు నా నమోవాకములు.

ఆదిలాబాదు,
4-10-1962.

దేవత సుబ్బారావు,
District & Sessions Judge.

ఓమ్

శ్రీ సాయీప్రసన్న!

# విజ్ఞప్తి

భక్తచింతానురోధేన ధత్తే నానాకృతీ స్స్వయమ్
అద్వైతానందరూపాయ తస్మై భగవతే నమః.

సోదరీ సోదర భక్తులార!

శ్రీ సాయీ మహాప్రభువు కృపా విశేషమున మీ యెల్లర ప్రేమాదరణాలవలన కృతిరూపమగు శ్రీ సాయినాథుని నిర్విఘ్నముగ వెలువడుచునే యున్నది. 1957 లో ప్రప్రథమమున నా మిత్రుడు శ్రీ గాదిమూతల శ్రీరాములు పంతులు B. A, B. Sc B. E. D (ప్రస్తుతము హెడ్మాష్టరు, Z. P. హైస్కూలు దుద్దుకూరు) గారి ధనసహాయముచే శ్రీ సాయిబాబా పూజాస్తవములు ముద్రింపబడినవి. శ్రీ సాయిబాబా మందిరములకు, భక్తసమాజములకు గోరిన సోదరీ సోదర భక్తులకు అందించు భాగ్యము కలిగినది. ఈ మొదటికూర్పు "విజ్ఞప్తి" యందు శ్రీరాములు పంతులుగారికి నా కృతజ్ఞత తెలిపి యుంటిని. శ్రీ సాయీలీలా ప్రచారములను నిర్వహించిన యీ నా మిత్రులు చి|| శ్రీరాములుగారు నాకు చిరస్మరణీయులు. వారిని, వారికుటుంబమును శ్రీ సాయీనాథుడు సర్వదా సర్వత్రా రక్షించుగాక యని ప్రార్థించుచున్నాను.

**పూజా స్తవములు:- రెండవకూర్పు:-**

మొదటి కూర్పునందు శ్రీ సాయీబాబాపూజ, అష్టోత్తర శత నామావళి, సువర్ణమాలా స్తవము, దండకము, శరణాగతి, హారతి, శ్రీ సాయీస్మరణ ప్రచురింపఁబడినవి. ఈ రెండవకూర్పు నందు బాబా సహస్రనామావళి- త్రికాలసేవలు (గేయములు) అధికముగఁ జేర్చఁబడినవి.

1 సహస్రనామావళి:- గురువర్యులగు పూజ్య శ్రీ బి. వి. నరసింహస్వామిగారు 1944 లో వారుకూర్చి సంస్కృతలిపి-ఆంగ్లవ్యాఖ్యతో ప్రచురించిన బాబా సహస్రనామావళి నాకుఁబ్రసాదించి దానిని తెనిగింపుమని అనుజ్ఞనిచ్చిరి. 1945 లో నే తెనుఁగు వివరణము రచించియుంటిని. అది ముద్రణముకాలేదు.1957 నుండి పలువురుభక్తులు బాబాసహస్రనామావళి ప్రచురింపుఁడని కోరుచుండిరి. కేవల సహస్రనామావళిమాత్రమిందు పర్వదినములందు విశేషసమయములందు బాబా సహస్రనామపూజ కావించుకొనుటకుఁజేర్పఁబడినది.

2 శ్రీ సాయీనాథ త్రికాలసేవ- (గేయములు) 6-12-58 న కర్నూలులో ఇంజనీరుగానున్న శ్రీ నిమ్మగడ్డ లక్ష్మీనారాయణగారు (ప్రస్తుతము **Professor, A.M.I.E. College, Guntur.**) ఉత్తరమువ్రాయుచు షిర్డీయందు ప్రతినిత్యము మరాఠీభాషయందుఁ గావింపఁబడు "సగుణోపాసనము" అను గ్రంథమునుపంపి దానిని తెనుఁగుదేశ

మున బాబాభక్తులు నిత్యము కీర్తించుకొని ఆనందించుటకు గేయములుగా రచించుడని కోరియుండిరి. ఇంకను పలువురు సోదరభక్తులు బాబాకీర్తనలు రచించుడని ఉత్తరములువ్రాసిరి. ఇదియు బాబా ఆజ్ఞగాభావించి, ఈగ్రంథమునకు గురువర్యులు పూజ్య శ్రీ బి. వి. నరసింహస్వామి గారు రచించిన ఆంగ్లవ్యాఖ్య నాధారముచేసికొని బాబా పలికించినవిధమున "శ్రీ సాయీబాబా త్రికాలసేవ" అను శీర్షిక క్రింద– "ప్రభాతసేవ"- "మధ్యాహ్నసేవ"- "రాత్రిసేవ"- అను అంశములుగవిభజించి యిందు చేర్చియుంటిని. ఈ "త్రికాలసేవ" ను ప్రేరేపకులగు శ్రీ సమ్మగట్ల లక్ష్మీనారాయణ గారికి నా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాడను.

చిన్నతనమునుండి భజనకీర్తనల నాలపించు స్వభావము కలిగియున్నవాడనైనను సంగీతజ్ఞానము లేనివాడను. సుగుణశీల సంగీత కోవిదుడు, సన్నిహిత బంధువు- మిత్రుడునగు చి॥ శ్రీ గంగరాజు వెంకటేశ్వర్లుగారి (I.L.T D Co Itd-, Chilakalurpeta) సహాయమున నిందలి గేయములను రాగ తాళ బద్ధముల గావింపగలిగితిని. చి॥ శ్రీ వెంకటేశ్వర్లుగారికి నేనెంతయు కృతజ్ఞుడను. వీరిని శ్రీ సాయీనాథుడు చల్లనిదీవెనల రక్షింతుగాకయని ప్రార్థించుచున్నాడను.

పూజా స్తవములు - రెండవకూర్పు - ముద్రణము:-

పలువురు సోదరభక్తులు బాబా పూజా స్తవములు పంపుడని ఉత్తరములు వ్రాయుచుండిరి. 1959 కే ప్రతులన్నియు [illegible]పడినవి. ఈకృతి ద్వితీయ ముద్రణమునుగూర్చి నా ప్రియసోదరుడు చి॥ పోదిల విశ్వనాథశర్మతో హెచ్చరించితిని. ఈ తమ్మునిగూర్చి సోదరభక్తులకుం గొంతవరకైనం దెలిపినంగాని కలము ముందుకుసాగునట్లులేదు. 1957 డిసెంబరు నెలలో ఈకృతి మొదటికూర్పుప్రతి నొకదానినిం బంపియుంటిని. దానిని చూచి 6-1-58 న ఉత్తరము వ్రాయుచు "సోదరా!" అని సంబోధించినాడు. ఇప్పటికి శతాధికముగ సోదరభక్తు లుత్తరములు వ్రాసియుండిరి. కాని 'సోదరా!' అని పిలిచినవారు లేరు. అంతే- అదిమొదలు చి॥ విశ్వనాథశర్మ ఏకోదరులకంటె నత్యధిక ప్రేమాదరణములం బ్రకటించుచు సత్యముగ ప్రియసోదరుడే అయినాడు. ఇది యేనాటిసంబంధమో ఎన్నిజన్మల బంధమో సర్వజ్ఞుడగు బాబాకే ఎఱుక. ఆతండ్రి లీలలలో నిదియొకటిగ భావించి ఆనందపరవశుడ నగుచుందును. కృతి రూపమగు శ్రీసాయీప్రభు సేవాభారము నా నాటినుండి వహించుచున్నాడు. నా ప్రియసోదరునకు దక్షిణహస్తముగ నుండు చి॥ శ్రీ కర్రి మునిరెడ్డి ప్రశంసనీయుడు. శ్రీకృష్ణార్జునులో యనునట్లు వీరిరువురు బావమఱదుల పోవుల వర్తించుచుందురు. వీ రిరువురు ప్రేమస్వరూపులు. ప్రేమ యీ యుగళరూపమునం బ్రకటమైన దనినను సత్యదూరముకాదు. సోదరభక్తులకు వారి

నెఱుకపఱచుటకై యిందు ప్రచురించినవారి ఛాయాచిత్రముల ప్రక్కనపలికిన "ప్రశంస–ఆశీస్సులు" ఏమాత్రమతిశయోక్తులుకావు. నా స్వానుభవమున గుర్తించి యానందించిన భావములేయవి యని విన్నవించువాఁడను.

ఈ నాప్రియసోదరుఁడు చి॥ విశ్వనాథశర్మ "శ్రీసాయీకబీరుసూక్తులు ముద్రణము కాలేదుగదా! ఆ కృతిని ముందు ప్రచురించుద"–మనినాఁడు. కాని నేను ఈ పూజాస్తవముల పునర్ముద్రణావశ్యకతనుగూర్చి తెల్పితిని. సరే. అట్లే కానిమ్మని తాను చి॥ మునిరెడ్డి యిరువురుకలసి యీకృతి రెండవకూర్పునకు ధనసహాయము చేసిరి. 1961 ఏప్రియల్ నెలలో ఈ కృతి ద్వితీయముద్రణమునకై యిచ్చియుంటిని. నా తమ్మునిసంకల్ప మెట్టిదియో గమనింపుఁడు. రెండునెలలలో ముద్రణము కావలసిన యీ గ్రంథము వెలువడుటకు షుమారు రెండుసంవత్సరములుపట్టినది. భౌతికకారణము లేవైనకావచ్చును. శ్రీసాయీప్రభువు లీలలలో నిదియొకటియనక తప్పదు. నాతమ్మునినోటనుండి వెలువడిన పలుకులను ప్రత్యక్షరసత్యములుచేయ బాబా తలంచెను. గుంటూరునుండి శ్రీ సాయీబాబా భజనమండలివారు ప్రచురించు 'శ్రీ సాయీలీలామృతమ' ను మాసపత్రికయందు 'శ్రీ సాయీ కబీరు సూక్తులు' 1962 జనవరినుండి ప్రచురించి 1962 అక్టోబరు సంచికతో పూర్తికావించిరి. ఈ మండలి కార్యదర్శి శ్రీ వి. కన్నయ్యగారికి నా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాఁడను. అంతవరకు ఈ పూజాస్తవములు రెండవకూర్పు నిలచిపోయినది. ఇది నా ప్రియసోదరుని

అమోఘసంకల్పము— బాబాలీల— కాని మఱియొకవిధముకాదు.
ఈ పూజా స్తవములు రెండవకూర్పు అత్యధికశోభతో వెలు
వడుటకు ధనసహాయముచేసిన చి॥ శ్రీ విశ్వనాథశర్మ— చి॥ శ్రీ
మునిరెడ్డి వీరిరువురకు నే నెంతయుఁగృతజ్ఞుఁడను. వీరికి వీరి
కుటుంబములకు సర్వశ్రేయముల సమకూర్చి సర్వకాలముల
రక్షించుగాతమని శ్రీ సాయినాథునిఁ బ్రార్థించువాఁడను.
శ్రీ సాయి ప్రభువునందుగల ప్రేమాతిశయముచే
ఈ పూజా స్తవములు ప్రత్యేకించి 200 ప్రతులు బాబా భక్త
లకుఁ దన చేతిమీఁదుగ అందించుకొనుటకై శ్రీ గరిమెళ్ళ
అన్నపూర్ణసూర్యనారాయణగారి ధర్మపత్ని శ్రీమతి సీతమ్మ
గారు. వెదురుపాక, (కోట రామచంద్రపురం తాలూకా, తూ.
గో. జిల్లా.) ధనసహాయము చేసిరి. వీరిని వీరికుటుంబమును శ్రీ
సాయినాథుఁడు సర్వదా సర్వథా రక్షించుగాతమని ప్రార్థించు
వాఁడను.

శ్రీ సాయిబాబా పూజా స్తవములు:-

శ్రీ సాయిబాబానుగూర్చి యిప్పటికి ఆతండిచేఁ
బలికింపఁబడి వెలువడిన 1 శ్రీసాయిమననము, 2 శ్రీసాయి
కరుణ, 3 శ్రీసాయిబాబాకూడ దేవుఁడేనా? ఉన్న దేవుళ్ళు
చాలకనా? (సందేహనివృత్తి). అను గ్రంథములందును, అఖిల
భారత సాయి సమాజము— మైలాపూరు — మద్రాసు నుండి
వెలువడు 'సాయిసుధ' అను మాసపత్రికయందు 1957 సంవ
త్సరమునుండి "ఏమీ, నిన్ను పేక్షింతునా?" అను శీర్షిక క్రింద
ప్రకటితమైన (బాబా చరిత్ర— భక్తుల అనుభవములు) వ్యాస

బాబాసన్నిధియందు పలుమతములకు- తెగలకు చెందిన వారం దఱు పరస్పర వైషమ్యములవిస్మరించి తమ "గురు-దైవము" గ శ్రీ సాయీప్రభువును సేవించి తరించిరి.

ప్రేమస్వరూపుఁడు- అమితసులభుఁడై 'షిర్డి' యందవత రించిన మహాప్రభువు బాబాయొక్క ద్వ్యక్షరాత్మకమగు 'సాయీ' నామముతప్ప ఈకృతియందు విశేషమేమియు లేదు. ఆతండ్రియొక్క పవిత్రనామమును ఏదోయొకరూపమున స్మరించి తరించునుద్దేశమే యీకృతిరూపము ధరించినది. సోదరీ సోదర భక్తులలో నే నొకరికేని నీకృతి సంతుష్టి-సంతృప్తులఁ గూర్పఁ జాలినను ఈ నాజీవితము ధన్యమైనదిగ భావించువాఁడను. ఇందలి దోషములను విస్మరించి, గుణలేశమును మాత్రము గ్రహించి నన్ననుగ్రహింప మీ యెల్లర వినయపూర్వకముగఁ బ్రార్థించువాఁడను. ఈ కృతి పాఠకశ్రోతలకు, ముద్రణ ద్రవ్య దాతలకు శ్రీ సాయీ మహాప్రభువు సచ్చిదానంద సుఖశాంతు లను బ్రసాదించుగాతమని అభ్యర్థించువాఁడను.

సుఖ శుభంబు లెల్లరు గాంచుచుందురు గాత!
ఎల్లరారోగ్యముగఁ బరియింతురు గాత!
కష్ట నిర్వృతి, శ్రిత జనాభీష్ట నియతిఁ
గలుగఁజేయుత! "శ్రీ సాయికరుణ" జగతి.

శ్రీ సాయీకుటీరము,
చిన్నగంజాం.
1-11-1962.

శ్రీ సాయీభక్తచరణ పరిచరణుఁడు,
బాపట్ల హనుమంతరావు.

శ్రీ సాయీ సమర్థ!

ఓమ్

శ్రీ సాయీ ప్రసన్న!

# మంగళా శాసనము




శ్రీ వేంకటేశ ప్రసిద్ధ స్వరూప గో
పాల సద్గురు కృపా వర్ధితంబు,
క్షేత్ర తీర్థ విశిష్ట శిర్డీపుర స్థిత
ద్వారకామాయీ ప్రభాసితంబు,
చందోర్కరాది ప్రశస్త భక్త సమాప్తి
ఐహికా ముష్మి కాప్యాయనంబు,
ప్రాణి హితంకర పరమేశ దివ్యావ
తార రహస్య ప్రచారకంబు,
సగుణ నిర్గుణోపాస నాసక్త ఫలము
వేద వేదాంత సిద్ధాంత విస్తృతంబు,
సర్వ సౌలభ్య మార్తరక్షణ సమర్థ
మగుచు "శ్రీ సాయిలీల" యీ జగతి వెలుగుచు!

శ్రీ సాయీ సమర్థ!

ఓమ్

శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయీ నాథాయనమః

# శ్రీ సాయిబాబా పూజా స్తవములు

## ౧ పూజ.

---

శ్రీసిద్ధి విఘ్నేశ! సేవింతునయ్య!
దోసముల్ డులిచి సంతుష్టి నిమ్మయ్య!
శ్రీసాయిపదభక్తిఁ జేకూర్పుమయ్య!
వాసిగ విఘ్నముల్ వారింపుమయ్య! 1

జయము, సాయీనాథ! సాయీశ! జయము,
జయము, ద్వారకమాయి సద్వాస! జయము.
జయము, సంశ్రిత భక్తజనపోష! జయము,
జయము, శిర్డీనివాసా! ప్రభూ! జయము. 2

రా రమ్ము, శిరిడి రాజ! సాయీశ!
ద్వారకామాయి సద్భవన నివాస!
భక్తజనపోష కల్పద్రుమా! రమ్ము,
ముక్తిదాయక! సాధుబుద్ధి నాకిమ్ము. 3

శ్రీరామ సాయిఁ బ్రసిద్ధ ప్రభావుఁ,
గారుణ్య రసపరి కలిత స్వభావు.
నినుఁ, బరమాత్మ, హృత్సీరేజ మందు
ననవరతము నిల్పి, ధ్యానించు చుందు. 4

నీవు వసింతు వీ నిఖిలంబు నందు,
జీవ చయంబు వసించు నీయందు;
వాసుదేవుండనఁ బఱగుచు నుందు,
శ్రీ సాయి! నిలుము నా హృత్పీఠ మందు. 5

హృదయ పద్మస్థమై యెనలేని మణులఁ
గదిరిన బంగారుగద్దెపై మిగులఁ
గూరుచో శ్రీసాయి! కోరి నీశ్రితులు
చేరి సల్పఁగ నమస్కృతులు వే గతులు. 6

బంగారుచెంబులోఁ బవిలమై యున్న
గంగతోఁ బాదముల్ గడుగనిమ్మన్న!
పరమపావన సాయిపాదాంబుపులను
శిరమునఁదాల్చి నిశ్చింత నుండెదను. 7

ఆర్తులౌ జనముల యార్తినిఁ బాపు
కీర్తినిఁగన్న నీ కేలు నా ప్రాఁపు!
ఆకాశ గాంగతోయముల నర్ఘ్యంబు
నీకిత్తు సాయి! మన్నింపు నిత్యంబు. 8

వేద శాస్త్ర స్మృతుల్ వెలయించినావు
వేదాంత వీథుల విహరింతు వీవు;
ఆచమనోదకం బర్పింతు నీకు
వాచంయమీశ! బాబా! సాయి! సాకు. 9

కడుఁ దీపిపెరుగుఁ జొక్కఁపుఁ దేనియలును
గుడముఁ గమ్మనినేయి గోక్షీరములను
అనువగు మధుపర్కమర్పింతుఁ గొనుము;
అనిశము సాయినాథా! నన్ను మనుము. 10

సంచితాగామాది సకల కర్మముల
నంచితగతి నాశమంచించి, శ్రితుల
సంచయముల నేలు సాయి! కైకొమ్ము
పంచామృతంబులఁ బఱగు తానమ్ము. 11

ముల్లోకములఁ బేరుమొనసి పూతములు
నెల్లతీర్థంబుల నెసఁగు తోయములఁ
జెలువొందఁ దెచ్చితి, శ్రీసాయి! రమ్ము
సలిలపుస్నానమ్ము, శ్రమను బోఁజిమ్ము. 12

తడి యొత్తనిమ్ము మోదమున నీవానఁ,
దొడుగుము వసనముల్, దువ్వల్వ కుపిని,
తలకప్పు ధరియింపు ద్వారకామాయి
నిలయ! దయామయ! నిఖిలేశ! సాయి! 13

దంత ధరార్తి విదళన విఖ్యాత
దండంబు నర్పింతుఁ దాల్పుమి చేత;
శ్రిత పారిజాతమౌ శ్రీ పాదయుగళి
హిత పాదుకలివె సాయీ! సాధుమౌళి! 14

సుందర గౌరాంగ! శుభ మయాకార!
చందనంబలఁ దెద సమ్మోద మార;
సతి పవిత్రంబులౌ సక్షతల్ గొనుము
పతితపావన! సాయిబాబ! ప్రాపగుము. 15

మంజుల కేయూర మణి హారములను,
వింజామరంబుల, వెల్ల ఛత్రమును,
నవవిధ రత్న కాంచన కిరీటమును,
నవధరింప గదయ్య! సాయి! యిమ్ముగను. 16

కప్పుర చూర్ణంబు, కపిల గో ఘృతము,
నొప్పగు సాంబ్రాణి యుతము, విస్తృతము,
నైన ధూపంబిదే యర్పింతు దేవ!
జ్ఞాన గమ్యా! సాయి! కరుణా స్వభావ! 17

వెలిని లోపలఁ దమోవిసరం బణంచుఁ
బెలుచ మువ్వత్తుల వెలుగుచు మించు.
దీప మర్పించెద దేవ! సాయీశ!
ఆపన్న భక్తజనార్తి ప్రణాశ! 18

మల్లెల మొల్లల మంకెనపూల,
ఫుల్లారుణాంబుజంబులఁ బొన్నపూల,
పారిజాతముల, సంపఁగి పుష్పములను,
మారేడు దళముల, మందారములను, 19

సాయి! నిన్ బూజింతుఁ జంద్రకాంతములు,
ధ్యేయ! నిన్నర్చింతుఁ దెల్ల దామరల,
తులసీ దళంబుల దొరను బూజింతుఁ,
గలువ పువ్వులఁ గౌతుకమునఁ బూజింతు. 20

సన్నజాజులఁ బాడ జలజ మర్చింతు,
గన్నేరు పువ్వులఁ గరము నర్పింతు;
చెన్నుగ, శ్రీ సాయిఁ జెంగల్వ బంతి
పున్నాగ తంగేడుపూలఁ బూజింతు. 21

(సహస్రనామావళి, అష్టోత్తరశత నామావళి భక్తుల శక్తి- అవకాశముల
ననుసరించి చెప్పనగును)

ద్వారకామాయి నివాస! నిన్ గొలుతు,
కారుణ్య రసమయాకార! నిన్ దలఁతు,
భవ రామకృష్ణ పావని రూపునెంతు,
భవ విమోచను సాయిబాబుఁ భజింతు. 22

ఘుమఘుమ తావులఁ గ్రుమ్మ శాకములు,
విమలాంబువులు, రుచుల్ పెనుచు లేహ్యములు,
పలువిధాపూప సూపములు, చోష్యములు,
సలలిత పాయస సద్యోఘృతములు. 23

పొంగారు రాజాన్నములు, తీపి పెరుగు,
బంగారు పాత్రలఁ బదిలమై పఱగు,
పరిషేచనము సేసి భక్షింపుమోయి!
శరణాగత త్రాణ చరణ! శ్రీ సాయి! 24

పనస తొనలు ద్రాక్షఫలము లిక్షువులు,
పానుపగు ఖర్జూరములు రసాలములు,
నారికేళంబు లనంటు లింపార
నారగింపవె! సాయి! ఆర్త మందార! 25

ఉత్తరాపోసనం బొయ్యఁ గొమ్ము,
దత్తరూపా! పరాత్పర! సాయి! యిమ్ము
కరములఁ బదములఁ గడుగఁగా నిమ్ము,
పారి, నొసర్పంగదే! ముఖమార్జనమ్ము. 26

పూగముల్, కుంకుమపువ్వు, కప్పురము
బాగు, తేలకి జాజిపత్రి ఫలము,
తమలపాకులును ముత్యంపుఁ జూర్ణంబుఁ,
గొమరార సాయి! కైకొను తమ్ములంబు. 27

ద్వారకామాయి సౌధాంతర శాయి!
నీరాజనం బిదే నీకిత్తు సాయి!
కప్పుర హారతిఁ గైకొమ్ము దేవ!
తప్పుల సైపు ముదార ప్రభావ! 28

మంగళంబిదె సాయి! మార్తాండతేజ!
మంగళంబిదె సాధుమండలి రాజ!
ద్వారకామాయి నివాస మంగళము,
కారుణ్యరస శుభాకార! మంగళము. 29

కుందముల్ జాజులు కురువకంబులును,
మందారములు బంతి మల్లెపూవులును,
పసనైన తులసి బిల్వ దళంబు లమరఁ
గుసుమాంజలిని సాయి ! కొను మోదమలర. 30

ఎల్ల మోహంబుల నెలమిఁ బోకార్చి,
యెల్ల శుభంబుల నింపారఁ గూర్చి,
చెలఁగు సాయికిఁ బ్రదక్షిణ మాచరింతుఁ,
బలుమారు సాగిలఁబడి వినుతింతు. 31

వందనంబిదె, సాయి ! భక్తమందార !
వందనం బార్తి నివారకోదార !
వందనంబు సమత్వభావ ప్రచార !
వందనంబు సమర్థ సద చిద్విహార ! 32

భవ మహాంభోనిధిఁ బడి పాపకృతుల
వివిధముల్ పొనరించి వేసరి మిగులఁ
బలుకోర్కెలకు జిక్కి, పారమున్ దఱియఁ
దెలియ; సాయీ ! రమ్ము తెప్పవై కదియ. 33

నిన్నుఁ గాకన్యంబు నే నిచ్చగింప,
నెన్నియే నవి నీకు నెనయే తలంప ?
నీ కృపామృత వృష్టినేఁ గోరువాఁడ
సాకల్య మదియు; శ్రీసాయి ! నీవాఁడ. 34

శిరిడి పుణ్యంపు క్షేత్రాంతరమున
ద్వారకామాయి సద్భవనంబులోన
శరణన్న వారి రక్షణ దీక్షనెక్కు
వరదయాంబుధి సాయిబాబు నాదిక్కు. 35

వేంకుశ సద్గురు విభునకు-జయము !
సంకట హరణుడౌ సాయికి-జయము !
ద్వారకామాయి సుస్థలికిని-జయము!
ధారుణి సాధువర్తనులకు- జయము ! 36

శ్రీ సాయీ ప్రసన్న!

శ్రీ సాయీ సమర్థ!

పూజ సమాప్తము.

శ్రీ సాయీ ప్రసన్న!

౨ శ్రీ సాయిబాబా

# అష్టోత్తర శత నామావళి

ఓమ్ శ్రీ సాయినాథాయ నమః
శ్రీ లక్ష్మీనారాయణాయ ,,
శ్రీ కృష్ణ రామ శివ మారుత్యాది రూపాయ ,,
శ్రీ శేషశాయినే ,,
గోదావరీతట షిర్డీవాసినే ,,
భక్తహృదయాలయాయ ,,
సర్వహృద్వాసినే ,,
భూతావాసాయ ,,
భూత భవిష్యద్భావవర్జితాయ ,,
కాలాతీతాయ నమః
కాలాయ ,,
కాల కాలాయ ,,
కాలదర్పదమనాయ ,,
మృత్యుంజయాయ ,,
అమర్త్యాయ ,,
మర్త్యాభయ ప్రదాయ ,,
జీవాధారాయ ,,
సర్వాధారాయ ,,
భక్తావన సమర్థాయ ,,
భక్తావన ప్రతిజ్ఞాయ నమః
అన్నవస్త్రదాయ ,,
ఆరోగ్య క్షేమదాయ ,,
ధన మాంగల్యదాయ ,,
వృద్ధి సిద్ధిదాయ ,,

ఓమ్ పుత్ర మిత్ర కళత్ర బంధుదాయ నమః
యోగక్షేమ వహాయ ,,
ఆపద్బాంధవాయ ,,
మార్గ బంధవే ,,
భుక్తిముక్తి స్వర్గాపవర్గదాయ ,,
ప్రియాయ నమః
ప్రీతివర్ధనాయ ,,
అంతర్యామినే ,,
సచ్చిదాత్మనే ,,
ఆనందాయ ,,
ఆనందదాయ ,,
పరమేశ్వరాయ ,,
పరబ్రహ్మణే ,,
పరమాత్మనే ,,
జ్ఞానస్వరూపిణే ,,
జగతః పిత్రే నమః
భక్తానాం మాతృ దాతృ పితామహాయ ,,
భక్తాభయప్రదాయ ,,
భక్తవత్సలాయ ,,
భక్తానుగ్రహ కాతరాయ ,,
శరణాగతవత్సలాయ ,,
భక్తి శక్తిప్రదాయ ,,
జ్ఞాన వైరాగ్యదాయ ,,

ఓమ్ ప్రేమ ప్రదాయ నమః

సంశయ హృదయ దౌర్బల్య పాపకర్మ వాసనా క్షయకరాయ ,,

హృదయగ్రంధి భేదకాయ నమః

కర్మధ్వంసినే ,,

శుద్ధ సత్వస్థితాయ ,,

గుణాతీత గుణాత్మనే ,,

అనంత కల్యాణ గుణాయ ,,

అమిత పరాక్రమాయ ,,

జయినే ,,

దుర్ధర్షాక్షోభ్యాయ ,,

అపరాజితాయ ,,

త్రిలోకేష్వవిఘాతగతయే ,,

అశక్య రహితాయ నమః

సర్వశక్తి మూర్తయే ,,

సురూప సుందరాయ ,,

సులోచనాయ ,,

బహురూప విశ్వమూర్తయే ,,

అరూపావ్యక్తాయ ,,

అచింత్యాయ ,,

సర్వాంతర్యామినే ,,

మనోవాగతీతాయ ,,

ప్రేమ మూర్తయే ,,

సులభ దుర్లభాయ నమః

అసహాయ సహాయాయ ,,

అనాథ నాథాయ ,,

దీనబాంధవే ,,

సర్వభార భృతే ,,

అకర్మానేకకర్మ సుకర్మిణే ,

పుణ్యశ్రవణ కీర్తనాయ ,,

తీర్థాయ ,,

వాసుదేవాయ ,,

ఓమ్ సతాంగతయే నమః

సత్పరాయణాయ ,,

లోకనాథాయ ,,

పావనానఘాయ ,,

అమృతాంశవే ,,

భాస్కరప్రభాయ ,,

బ్రహ్మచర్య తపశ్చర్యాది సువ్రతాయ ,,

సత్యధర్మ పరాయణాయ ,,

సిద్ధేశ్వరాయ ,,

సిద్ధ సంకల్పాయ ,,

యోగేశ్వరాయ ,,

భగవతే నమః

భక్తవత్సలాయ ,,

సత్పురుషాయ ,,

పురుషోత్తమాయ ,,

సత్యతత్త్వ బోధకాయ ,,

కామాది షడ్వైరిధ్వంసినే ,,

అభేదానందానుభవప్రదాయ ,,

సమసర్వమత సమ్మతాయ ,,

శ్రీదక్షిణామూర్తయే ,,

శ్రీవేంకటేశ రమణాయ ,,

అద్భుతానంత చర్యాయ నమః

ప్రపన్నార్తి హరాయ ,,

సంసారసర్వదుఃఖక్షయకారాయ ,,

సర్వవిత్ సర్వతోముఖాయ ,,

సర్వాంతర్బహిస్థితాయ ,,

సర్వమంగళకరాయ ,,

సర్వాభీష్ట ప్రదాయ ,,

సమరససన్మార్గ స్థాపనాయ ,,

శ్రీసమర్థ సచ్చిదానంద సద్గురు

శ్రీసాయినాథాయ నమః

అష్టోత్తర శతనామావళి సమాప్తము

శ్రీ సాయి సమర్థ!

# 3 సువర్ణమాలాస్తవము

శరణు శరణు శ్రీసాయీ! నీ శుభచరణంబులు నాశరణు ప్రభూ!
అనిశము నీస్మరణామృత మానుచు నలరునాల్క నిడుమయ్యా! ప్రభూ!
ఆసలపాల్సేయక సంతృప్తిని నాత్మకిడుమి యనయంబు ప్రభూ! ,,
ఇలపై నెటనీకెనయౌ రక్షకునెఱుగ నెఱుగసాయీశ! ప్రభూ ,,
ఈసు లసూయల నెనసి పెనయు నాహృది మాలిన్యము నెడపు ,,
ఉత్తమ భక్తమహోన్నతసంఖ్యం బొనరఁజేసి నన్నోము ,,
ఊరక చింతల నొంది కుందుమది కూరట శాంతుల నొసఁగు ,,
ఋజుపథమున వర్తింపఁజేసి నీప్రేమపాత్రు నొనరింపు ,,
ౠపర్ణమను విగళిత సుమమును నీలీలాంఘ్రులఁ బదలించు ,,
ఎల్లభూతముల హృదయాంతరముల నీవ నిలచి భరియింతు ,,
ఏన్ మూఢాత్ముడ నేమెఱుంగఁగల నీమాయాంచితవృత్తి ,,
ఐహికకాంక్షల నన్నిటిఁ బాపి, నిరామయ పథమిమ్మయ్యా ,,
ఒకపరి నిను శరణొందిన జీవిని నుద్ధరింతు ప్రాపొసఁగి, ,,
ఓదార్పు హిత మొసఁగుచు శ్రితజన ముత్సహింపఁ గదుయుక్తి ,,
ఔదార్యము నీయాకృతి యది యవ్యాజకలితమై యలరు ,,
అంతవంత దేహాదులపై మమతాహంకృతు లొగినడఁపు ,,
కరుణాలయ! నీకారుణ్యకటాక్షమ సకలంబగుఁగాదె ప్రభూ! ప్రభూ! ,,
ఖలమతి మును నేఁగావించిన దుష్కర్మల నైపంగదవె ,,
గమవతనంబునఁ గానక తిరుగుచు గాసిలితిని పలుగతుల ,,
ఘనసంసరణాగాధ వార్థి నేఁ దరణిని దాటంగలను ? ,,
జ్ఞానవిహీనుఁడఁగనుట యెట్లు సద్గతి నీకరుణను గాక ,,

చపలమతినిఁ గొనసాగని వలువాంఛలకుఁ జిక్కి వేసరితి ప్రభూ!
చలమున విత్తార్జనకై నెక్కుడు శ్రమఁబడితి నీచగతి ,,
ఛన్నప్రజ్ఞుఁడ సదసద్విషయ విచారశూన్యుఁడను సాయి ,,
జగతి సత్యమని సద్వస్తువుఁ గనఁజాలక కాలము జరిగె ,,
జంత్రము దేహము జంత్రకాఁడ విద్యాగతిఁ ద్రిప్పుము సాయి ,,
ఝషకేతుని బలుసాయకములఁబడి సహియఁజేయకుము సాయి ,,
జ్ఞప్తిఁబఱుపు మీ సకలము నీ విష్ణ్వంశంబని శ్రీ సాయి ,,
టంకంబుల మూటలు గూర్చుట చేటని మనమున నాటనిము ,,
ఠవణిల్లుత శ్రేష్ఠంబగు నీ యష్టాక్షరము లభీష్టముగ ,,
డంబుగలోక విడంబనకై కడుడస్సితి శ్రమల నడంపు ,,
ఢక్కఁగొట్టి సుదృఢంబుగ నీ ప్రౌఢత్వముఁ జాటఁగడఁగుము ,,
ణాదిపదస్ఫురణము నీయక కరుణామతిఁ గనుము ప్రణతులు ,,
తలఁపు పలుకు చేఁతలనొకపరి సత్వపథంబునఁ జనఁదార్పు ,,
"థూ" యని జనములు దూషింపరె శ్లాఘా దుర్వ్యాప్తినిఁ గనుతోఁడ ,,
దురిత పంకమునఁ ద్రోయక సచ్చరితున్ బొనరింపు శ్రితుండ ,,
ధనభోగాదుల తగులాటము నంతయుఁ గూర్పక నష్టనుపు ,,
నయభయములతో నడుపఁబెట్టి జన్మము సఫలత్వ మొనర్పు ,,
పరకాంతా పరభాగ్యాహరణ దుర్భావము వారింపఁగదె! ,,
ఫలితం బాసింపక స్వకర్మ సలుపఁగ దృఢమతిఁ గూర్పఁగదె! ,,
బహుముఖములఁబడి పరువెత్తెడి యీ పాపమతిని స్థిరపఱుపు ,,
భవ మహార్ణవము పారముఁ గను నీ పావనతరణి నాప్రాపు ,,
మనుజ జన్మమది మహిదుర్లభమను మాటఁ దలఁపునిడి మనుపు ,,
యమనియమాది సదభ్యాసంబుల సందువస్తు నీ వగుదు ,,

రజ్జుసర్ప భ్రాంతిని జగము పరంబనుదలఁపు తొలఁగుత ! ప్రభూ!
అట్టిపాల్పడి నిరంతరము ఋణార్ణవ మగ్నుండఁ గరమిడు ,,
అవమేఁ నీయెడ లక్ష్యముఁ గలిగి తలంప నమోఘఫలంబు ,,
వసుధ దురాగ్రహ వంచనవృత్తుల పాల్సేయక ప్రోవఁగదె ,,
శతజన్మలఁ గనఁజాలునె మోక్షము జ్ఞానము వదయని జనుఁడు ,,
షడ్రిపుషడూర్మి షడ్వికారముల సమయఁ జేసినను సాకు ,,
సతతము సజ్జనసంగతిఁ గూరిచి శాంత చిత్తునిగ సలుపు ,,
హరి! హరి! వ్యర్థవ్యాసంగంబుల నాయువెల్ల చనెనయ్య ,,
శ్లాదిపదము గల్గదు తుదిఁగూర్చి తలంచెద సుమంగళంబు! ,,
క్షమింపు వాగ్దోషంబుల నెందేఁ గలిగిన బాబా! సాయి! ప్రభూ!
శరణు శరణు శ్రీసాయీ! నీశుభ చరణంబులు నాశరణు ప్రభూ!

శ్రీ పరంధామాప్త సిద్ధిప్రపూర్ణ
శ్రీ పాదములకుఁ గూరిచి యీసువర్ణ
మాల నర్పింతుఁ బ్రేమంబునఁజేయి
అలంబనం బిడుమయ్య! శ్రీ సాయి!

శ్రీసాయీ సువర్ణమాలాస్తవము - సంపూర్ణము.

శ్రీ సాయీ ప్రసన్న!

# 4 శ్రీసాయిబాబా దండకము

జై! జై! ప్రభూ! సచ్చిదానంద సుందస్మితోదార! జై! భక్త సందోహ మందార! జై! వాసుదేవ ప్రశస్తావతారా! శ్రితవ్రాత సంరక్ష దక్షా! సదా భక్తపక్షా! నినున్ గోరి నీ పాదపంకేరుహంబుల్ మదిన్నిల్పి, నీ దివ్య నామామృతాస్వాదనాసక్తి నా నాల్కకున్ గూర్చ, నిత్యంబు నీ కీర్తిఁ గీర్తింప నీ దండకం బొక్కటిన్ బల్క నూహించితిన్ దేవ! నావాక్కునన్ నిల్చి భాషింపవే! శిరిడీవాస! శ్రీ ద్వారకామాయి! సన్మందిరాంతర్వి రాజత్ప్రభా చిద్విలాసా! గురూత్తంస! శ్రీ సాయి! సాయీ ప్రభూ! జన్మదాయీ నందలాల్ గర్భ సచ్ఛుక్తి ముక్తాఫలంబై భువిం బుట్టుపుంగాంచి తీవంచు, నీజన్మవాసంబు ఘూర్జర్ప్రదేశాంతరస్థంబు పత్రీ మహాగ్రామ మంచెన్ను చున్నారిలన్, సాధుజన్మంబుఁ గర్మంబు లెవ్వారికిన్ వేద్యమౌ? వేంకుశాభిఖ్యుఁడౌ గోపరావ్ దేశముఖ్ సత్కృపాపూర్ణ సంప్రాపితైశ్వర్య ధుర్యుండవున్, దీన సంరక్ష దక్షుండ నీవంచు సంకీర్తనల్ సేయరే నిన్ను? నీ భక్త సంరక్షణార్థంబు చాన్ భాయ్ పటేల్ కారణంబూని, శిర్డీకి వేంచేయవే? ముస్సల్మానుచేఁ బెంపుగంటన్ ముసల్మానురూపంబునన్ దోఁచు నిన్గాంచి హిందూజనం బాదరింపంగ రాకున్న, నీవా మసీదందునన్ నిల్చి యద్దానికిన్ ద్వారకామాయి నామంబు గైసేయవే? వేనవేల్ భక్తులన్ బ్రోవవే? కారణం బొందుకల్పించి నీ వారి నీపజ్జకున్ జేర్పవే? యొక్కమా రెట్టివాఁడేని "శ్రీ సాయిబాబా! ననున్ బ్రోవవే!" యన్న, నవ్వానిఁ జేపట్టి యోగంబు క్షేమంబు సర్వంబునున్ బూనవే? తండ్రి! నీ ప్రేమవారాశికిన్ బారమున్ గల్గునే? జన్మ లెన్నింటనైనన్ శ్రితుంజేరి మోక్షంబు బ్రాప్తింపనందాక రక్షింపవే? దేవ! నీ పాదసంవాహనం బాచరింపంగ 'చందోర్కరే' పాటిపున్నెంబు నార్జించెనో గాదె? నిత్యంబు భిక్షన్ సమర్పింప తాత్యా పటేల్ శ్యాము లే నోము గావించిరో?

సద్గురూ! నాచ్నె దీక్షిత్ దభోల్కర్లు, రేగే మహల్సాపతుల్ నాగ! నార్కే
నిమోనర్కర్ల భాగ్యం బదేపాటిదో? 'రామకృష్ణాఖ్య-ఆయీ' ; నీదు సేవా
ప్రసాదంబు లార్జింప నే పుణ్యముల్ సేసెనయ్యా! 'గణూదాస్ మహారాజు'
నీ కీర్తనన్ బ్రొద్దుపుచ్చెంగదే! 'తారబాయ్ చంద్రబాయీల' రక్షింపవే?
వారు వీర చుం బల్కంగ నేమౌను? నీ ప్రాపునన్ వేనవేల్ భక్తు
లానందమున్ బొందలేదే? గురూ! చీమగా, కాకిగా, పిల్లిగా, కుక్కగా,
జోగిగా పెక్కురూపంబులన్ భక్తులన్ డాసి యవ్వారికిన్ మేలుఁగూర్పంగఁ
బోవే? మహాత్మా! నిన్నున్ దాసినన్ దక్షిణల్ గొంట లవ్వారికిన్ గర్మ
నిర్మూలనం బాచరింపంగఁ గాదే? దయాసింధు! నీ యాజ్ఞ లా వింతలౌ
నంట! నీ పల్కు లా వేదవాక్యంబులౌ, దేవ! నీ యాశ్రయంబొందు నా
జీవి యేదేనియున్ మేలుఁబొందున్ గదే! అప్ప! యా కప్పనే సుక్కనే
నెద్దునేన్ మేకనేన్ ఘోరవ్యాఘ్రంబునే బ్రేమఁగాపాడవే? నీ కరస్పర్శ
సర్వార్థముల్ గూర్చు, నీ చూపులే యాపదల్ వాపు, నీదౌ ధునిన్ వెల్గు
భస్మంబు జాడ్యంబులన్ ద్రోలదే? నీదు నామప్రభావం బగణ్యంబు, నీపల్కు
ప్రజ్ఞానసిద్ధిన్ బ్రసాదింపదే? "మంత్ర తంత్రోపదేశంబులన్ లాభ
మేమౌను? నీలో వెలింగొందు వానిన్ గనన్ సర్వమున్ వేద్యమౌ"
నంచు మున్నాడవే? "చక్కనౌ రూపముల్ సూచి స్రుక్కంగ నీకేల?
యవ్వాని నిర్మించు నా ప్రోడ చక్కందనం బెంతొ వీక్షింపు" మంచున్
ప్రభాషింపవే? "యోర్పు సద్భక్తులే నాకుఁగాన్కల్ సుమీ!" యంచు మున్
చెల్పవే? స్వామి! నీ దివ్యచారిత్రమున్ నామసంకీర్తనల్ చేయు భాగ్యంబు
నీ యాంధ్రదేశంబునన్ వ్యాపృతిన్ జేయు శ్రీ నారసింహుండు నీ భక్తుఁడౌ
కేశవుండున్ ప్రభూ! బాబు నారాయణుం డెట్టి పూజాదులన్ దొల్లి గావించిరో
దేవ! యీ స్వల్పునిన్ జేరగాఁ బిల్చి నీపాద సద్భక్తి గల్పించి, నీకబ్బముల్
పల్కు నాజ్ఞన్ బ్రసాదించి యీదీను నిత్యంబునున్ గంటికిన్ రెప్ప
చందంబునన్ గానవే? యెప్పుడేమాత్ర మేతీరునన్ సాయమున్ గూర్పనౌ
నట్లుఁ గావింపవే? నిన్ను సేవించు నీవాని గేహంబునన్ దిండికిన్ గుడ్డ
కున్ లోటులేదంచు మున్పల్కు నీ వాక్యముల్ 'సత్యమౌ !సత్యమౌ!

సత్యమా!' నంచు మమ్మాగం జాటంగ నీ దొక్కండేచాలు నయ్యా! సమస్తాపరాధంబులన్ సైచి యీ నీదు బిడ్డన్ గృపాళుండవై బ్రోచుచున్ జిత్తసంశుద్ధిగల్పించి నీనామ సంకీర్తనల్ సేయు భాగ్యంబుం జేకూర్పవే! నీదు సేవా పరాసక్తిం గల్పింపవే! సర్వభూతంబులన్ నిన్ను వీక్షించు బుద్ధిన్ బ్రసాదింపవే! నీదుసూక్తుల్ సదా సంస్మరింపన్ దలంపీయవే! సత్యమార్గంబునం బోవు భాగ్యంబు గల్పింపవే! నీయెడన్ విస్మృతిన్ గల్గంగానీయకే "సాయి! శ్రీసాయి!" యంచున్ సదా నాల్కపై నీ 'ద్వయిన్' వర్తిలన్ జేయవే! తల్లియుందండ్రియున్ దైవమున్ దేశికుందర్థమున్ సర్వమున్ నీవయై తోఁపఁజూపంగదే? ద్వారకామాయివాసా! శ్రితార్తిప్రణాశా! సదా చిద్విలాసా! గురూత్తంస! శ్రీసాయి! శ్రీసాయినాథా! దయాసింధు! సాయీప్రభూ! సాయి విశ్వేశ్వరా! సాయి రామప్రభూ! సాయి శ్రీకృష్ణ! శ్రీ మారుతీసాయి! శ్రీ దత్తసాయీ! సమర్థా! ప్రభూ! సద్గురూ! సాయి! శ్రీసాయిబాబా! చిదానంద! సాయీశ! తుభ్యంనమస్తే! నమస్తే! నమస్తే! నమః.

శ్రీ సాయిబాబా దండకము సమాప్తము.

శ్రీ సాయీ సమర్థ!

---

శ్రీ సాయీ ప్రసన్న!

## 2. ప్రార్థన:- శరణాగతి

శ్రీ సాయి సద్గురూ! చిన్మయాకార!
వాసుదేవ! శ్రితభక్త మందార!
జననమరణరూప సంసార ఘోర
వనధిఁగూలితి నింకఁ బారముఁజేర
నీ పదాంబుజ భక్తి నిష్ఠపోతంబు
ప్రాపుఁగూర్పవె! సాయిబాబా! సతంబు.
వివిధ విషయము లన్వేషించి, వానఁ
దవులునింద్రియములఁ దగఁద్రిప్పి, లోనఁ
బొలుచుపరాత్మాభి ముఖముఁ గావింపు;
తెలివి నాత్మానుభూతినిఁ బ్రసాదింపు.
సుతుఁడేని సతియేని సుహృదుండునేని
మృతివేళ నెవరుఁ జేయిడరు సుంతేని,
మోక్ష సౌఖ్యముల ప్రాపును గూర్తువీవ
అక్షీణ కరుణా కటాక్ష! శ్రీదేవ!
వాదోపవాదముల్ పాపవర్తనల
నేదింపు స్వార్థ ప్రవృత్త కార్యముల;
నాలుక నీ దివ్య నామ ధ్యేయమ్ము
రేలుబవళ్లు స్మరింపఁగానిమ్ము.
తలఁపులనెల్ల దౌడపులఁ బోసడపి,
పలు గృహధనధాన్య వాంఛలఁ గెడపి,

దేహ విస్మృతిఁ గూర్చి ధృతిబుద్ధు లిడుము;
మోహబంధముల నిర్మూలింపు చిరము.
సాయి! నీ నామ సంస్మరణంబు నిమ్ము
మాయయనౌ నితరంబు మఱచిపోనిమ్ము.
మతిచంచలత్వంబు మాంపు సామి!
ధృతిశాంతి విమలభక్తిని గూర్చియోమి.
స్వామి! నీ ప్రేమవీక్షణ దీప్తి వెలుఁగ
నా మోహ తమసమంతయుఁ బాయు వేగఁ;
బొనుపుగనేతొంట పుట్టువులందుఁ
బొనరించితినొ యెట్టి పున్నెంబు, లిందు
ననఘ! నీ లీలాకథామృతం బానఁ
గనినాఁడ, మెలకువఁ గంటి నీమేన.
సాయి! నీపదభక్తి; సాయి! నీసేవఁ
బాయనీయకు సత్కృపామేయభావ!

(శ్రీ) సాయీ సమర్థ!



# ౬ హారతి

శ్రీ రామ సాయీ! సిద్ధావతారా! శ్రితజనమందారా!
ద్వారకమాయీ భవనవిహారా! భవభయపరిహారా! ॥శ్రీరామ॥
హారతి- కర్పూరహారతి- మంగళ హారతి నర్పింతు,
కారుణ్యమున జీవగణములఁ బ్రోతువు కరములఁ జోడింతు. ॥శ్రీ॥
నీ బిడ్డలము మేము నీపాదరజమున- నిశ్చింత వ్రాలెదము
బాబా! యాసల పాల్పడఁజేయక- పరమపదంబిడుము ॥శ్రీ॥
ఎవరెవరెటు లాశ్రయింతురో వారల- నీవటు లేలుదువు;
వివరింప నీశక్తి విస్తృతాద్భుతము- విశ్వైకబంధుఁడవు. ॥శ్రీ॥
నీ నామపోతంబు నిశ్చయముగ భవ నీరధి దాటించు
దీనజనంబుల దిక్కువు సాయీ! దేవా! కరుణించు. ॥శ్రీ॥
సగుణబ్రహ్మంబుగ జగతినిఁ బొడమితి- సాయి! శ్రీహరి వీవు,
అగణిత నిగమాగమములు శాస్త్రములు-సత్యము నిన్నెఱుఁగలేవు॥
॥శ్రీ॥
శరణాగత దీనసంరక్షకుఁడవను శపథము నిలఁబెట్టుము,
పరమేశ! శ్రీసాయి! వరదాభయకరముఁ- జాపి నన్జేపట్టుము ॥శ్రీ॥
నీ నిత్యపదసేవ నిరుపమభాగ్యమ్ము- నిరతంబు మాకీయుము
సాదరముగ హనుమచాతకమున్ సాయీ- జలదాంబు
లానింపుము. ॥శ్రీ॥
నీరాజనంబిదె నీకిత్తు శ్రీ సాయి!- నిఖిలజగదాధార!
ద్వారకామాయీ బాబాసాయీ!- భవభయపరిహార! ॥శ్రీరామ॥

---

# ॥ శ్రీ సాయినాథ సహస్ర నామావళి

ఓమ్ నమో భగవతే సాయినాథాయ
ఆచార్యదేవోభవ, క్ష్వమిప సర్వంమును చేపటుచు
శ్రీ సాయినాథాయ నమః

---

ఓమ్ అఖండ సచ్చిదానం
దాయ నమః
అఖిల జీవవత్సలాయ ,,
అఖిల వస్తువిస్తారాయ ,,
అక్బరాజ్ఞాభివందితాయ ,,
అఖిలచేతనావిష్టాయ ,,
అఖిలవేద సంప్రదాయ ,,
అఖిలాండేశరూపోఽపి
పిండేపిండేప్రతిష్ఠితాయ ,,
అగ్నిహైత్రే ,,
అగ్ర్యభూమ్నే ,,
అగణిత గుణాయ ,,
అఘౌఘ సన్నివర్తినే ,,
అచింత్య మహిమ్నే ,,
అచలాయ ,,
అచ్యుతాయ ,,
అజాయ ,,

ఓమ్ అజాత శత్రవే నమః
అజ్ఞానతిమిరాంధానాం
చక్షురున్మీలనక్షమాయ ,,
అజన్మస్థితి నాశాయ ,,
అణిమాదివిభూషితాయ ,,
అత్యున్నత ధునీజ్వాలా
మాజ్ఞయైవ నివర్తకాయ ,,
అత్యుల్బణ మహాసర్పా
దపి భక్తసురక్షిత్రే ,,
అతితీవ్ర తపస్తప్తాయ ,,
అతినమ్రస్వభావకాయ ,,
అన్నదానసదానిష్ఠాయ ,,
అతిథిభుక్తశేష భుజే ,,
అదృశ్యలోక సంచారిణే ,,
అదృష్టపూర్వ దర్శయిత్రే ,,
అద్వైతవస్తుతత్త్వజ్ఞాయ ,,
అద్వైతానందవర్షకాయ ,,

ఓమ్ అద్భుతానంతశక్తయే నమః
అధిష్ఠానాయ ,,
అధోక్షజాయ ,,
అధరోర్మరు తరుచ్ఛేత్రే ,,
అధియజ్ఞాయ ,,
అధిభూతాయ ,,
అధిదైవాయ ,,
అధ్యక్షాయ ,,
అనఘాయ ,,
అనంతనామ్నే ,,
అనంతగుణభూషణాయ ,,
అనంతమూర్తయే ,,
అనంతాయ ,,
అనంతశక్తిసంయుతాయ ,,
అనంతైశ్వర్య వీర్యాయ ,,
అనల్పాకతి సూనితాయ ,,
అనవరత సమాధిస్థాయ ,,
అనాథపరిరక్షకాయ ,,
అనన్యప్రేమసంహృష్ట
గురుపాదవిలీనహృదే ,,
అనాదృతాష్ట సిద్ధయే ,,
అనామయపదప్రదాయ ,,

ఓమ్ అనాదిమత్పరబ్రహ్మణే ,,
అనాహత దివాకరాయ ,,
అనిర్దేశవపుషే ,,
అనిమేషేక్షిత ప్రజాయ ,,
అనుగ్రహార్థమూర్తయే ,,
అనువర్తిత వేంకటేశాయ ,,
అనేకదివ్యమూర్తయే ,,
అనేకాద్భుతదర్శనాయ ,,
అనేకజన్మజంపాపంస్మృతి
మాత్రేణహారకాయ ,,
అనేకజన్మవృత్తాంతం
సవిస్తారముదీరయతే ,,
అనేకజన్మసంప్రాప్త
కర్మబంధ విదారణాయ ,,
అనేకజన్మ సంసిద్ధశక్తి
జ్ఞాన స్వరూపవతే ,,
అంతర్బహిశ్చ సర్వత్ర
వ్యాప్తాఖిలచరాచరాయ ,,
అంతర్హృదయఆకాశాయ ,,
అంతకాలేఽపిరక్షకాయ ,,
అంతర్యామినే ,,
అంతరాత్మనే ,,
అన్నవస్త్రేప్సితప్రదాయ ,,

ఓం అపరాజిత శక్తయే నమః
అపరిగ్రహ భూషితాయ ,,
అపవర్గ ప్రదాత్రే ,,
అష్టవర్గమయాయ ,,
అపాంతరాత్మరూపేణ స్రష్టు
రిష్టప్రవర్తకాయ ,,
అపావృతకృపాగారాయ ,,
అపారజ్ఞాన శక్తిమతే ,,
అపార్థివ దేహస్థాయ ,,
అపాం పుష్పనిబోధకాయ ,,
అప్రపంచాయ ,,
అప్రమత్తాయ ,,
అప్రమేయగుణాకరాయ ,,
అప్రాకృత వపుషే ,,
అప్రాకృతపరాక్రమాయ ,,
అప్రార్థితేష్ట దాత్రే ,,
అబ్దులాది పరాగతయే ,,
అభయం సర్వభూతేభ్యో
దదామీతి వ్రతినే ,,
అభిమానాతిదూరాయ ,,
అభిషేకచమత్కృతయే ,,
అభీష్ట వరవర్షిణే ,,
అభీష్ట దివ్యశక్తిభృతే ,,

ఓమ్ అభేదానంద
సంభాత్రే నమః
అమర్త్యాయ ,,
అమృతవాక్స్రుతయే ,,
అరవింద దళాక్షాయ ,,
అమిత పరాక్రమాయ ,,
అరిషడ్వర్గనాశినే ,,
అరిష్టఘ్నాయ ,,
అర్హసత్తమాయ ,,
అలభ్యలాభ సంధాత్రే ,,
అల్పదానసుతోషితాయ ,,
అల్లానామసదావక్త్రే ,,100
అలంబుద్ధ్యా
స్వాలంకృతాయ ,,
అవతారితసర్వేశాయ ,,
అవధీరిత వైభవాయ ,,
అవలంబ్య పదాబ్జాయ ,,
అవాలియేతి విశ్రుతాయ ,,
అవధూతాఖిలోపాధయే ,,
అవిశిష్టాయ ,,
అవశిష్ట స్వకార్యార్థం
త్యక్త దేహం ప్రవిష్టవతే ,,
అవాక్పాణి పాదోరవే ,,

ఓమ్ అవాఙ్మానస గోచరాయ నమః
అవాప్త సర్వకామోఽపి
కర్మణ్యేవ ప్రతిష్ఠితాయ ,,
అవిచ్ఛిన్నాగ్నిహోత్రాయ ,,
అవిచ్ఛిన్నసుఖప్రదాయ ,,
అవేక్షిత దిగంతస్థ
ప్రజాపాలన నిష్ఠితాయ ,,
అవ్యాజ కరుణాసింధవే ,,
అవ్యాహతేష్ట దేశగాయ ,,
అవ్యాహృతోపదేశాయ ,,
అవ్యాహృతసుఖప్రదాయ ,,
అశక్య శక్యకర్త్రే ,,
అశుభాశయ శుద్ధికృతే ,,
అశేషభూతహృత్ స్థాణవే ,,
అశోక మోహశృంఖలాయ ,,
అష్టైశ్వర్యయుతత్యాగినే ,,
అష్టసిద్ధి పరాఙ్ముఖాయ ,,
అసంగయోగయుక్తాత్మనే ,,
అసంగదృఢ శస్త్రభృతే ,,
అసంఖ్యేయావతారేషు
ఋణానుబంధిరక్షకాయ ,,
అహం బ్రహ్మస్థితప్రజ్ఞాయ ,,

ఓమ్అహంభావ
వివర్జితాయ నమః
అహం త్వం చ త్వమేవాహ
మితి తత్త్వప్రబోధకాయ ,,
అహేతుక కృపాసింధవే ,,
అహింసా నిరతాయ ,,
అక్షీణ సౌహృదాయ ,,
అక్షయ్యాయ ,,
అక్షయ సుఖప్రదాయ ,,
అక్షరాదపి కూటస్థా
దుత్తమపురుషోత్తమాయ ,,
ఆఖువాహన మూర్తయే ,,
ఆగమాద్యంతసన్నుతాయ ,,
ఆగమాతీత సద్భావాయ ,,
ఆచార్య పరమాయ ,,
ఆత్మానుభవసంతుష్టాయ ,,
ఆత్మవిద్యా విశారదాయ ,,
ఆత్మానంద ప్రకాశాయ ,,
ఆత్మైవ పరమాత్మదృశే ,,
ఆత్మైక సర్వభూతాత్మనే ,,
ఆత్మారామాయ ,,
ఆత్మవతే ,,
ఆదిత్య మధ్యవర్తినే ,,

ఓమ్ ఆదిమధ్యాంత
వర్జితాయ నమః
ఆనంద పరమానందాయ ,,
ఆనందప్రదాయ ,,
ఆనాకమాదృతాజ్ఞాయ ,,
ఆనతావన నిర్వృతయే ,,
ఆపదామపహర్త్రే ,,
ఆపద్బాంధవాయ ,,
ఆఫ్రికాగత వైద్యాయ
పరమానందదాయకాయ ,,
ఆయురారోగ్య దాత్రే ,,
ఆర్తత్రాణపరాయణాయ ,,
ఆరోపణాపవాదైశ్చ
మాయాయోగవియోగ
కృతే ,,
ఆవిష్కృత తిరోధత్త
బహురూపవిడంబనాయ ,,
ఆర్ద్రచిత్తేన భక్తానాం
సదానుగ్రహవర్షకాయ ,,
ఆశాపాశవిముక్తాయ ,,
ఆశాపాశవిమోచకాయ ,,
ఇచ్ఛాధీనజగత్సర్వాయ ,,
ఇచ్ఛాధీన వపుషే ,,

ఓమ్ఇష్టేప్సితార్థదాత్రే నమః
ఇచ్ఛామోహనివర్తకాయ ,,
ఇచ్ఛోత్థదుఃఖసంఛేత్రే ,,
ఇంద్రియారాతిదర్పఘ్నే ,,
ఇందిరారమణ హాలాదినామ
సాహస్రపూతహృదే ,,
ఇందీవర దలజ్యోతిర్లోచనా
లంకృతాననాయ ,,
ఇందు శీతలభాషిణే ,,
ఇందువత్ప్రియదర్శనాయ ,,
ఇష్టాపూర్తశతైర్లబ్ధాయ ,,
ఇష్టదైవ స్వరూపధృతే ,,
ఇష్టికాదానసుప్రీతాయ ,,
ఇష్టికాలయ రక్షిత్రే ,,
ఈశాసక్తమనోబుద్ధయే ,,
ఈశారాధన తత్పరాయ ,,
ఈశితాఖిల దేవాయ ,,
ఈశావాస్యార్థసూచకాయ ,,
ఉచ్చారణాదృతే భక్త
హృదంత ఉపదేశకాయ ,,
ఉత్తమప్రేమ మార్గిణే ,,
ఉత్తమోత్తారకర్మకృతే ,,
ఉదాసీనవదాసీనాయ ,,

ఓమ్ ఉద్ధరామీత్యుదీరకాయ నమః
ఉద్ధవాయమయాప్రోక్తం భాగవతమితిబ్రువతే ,,
ఉన్మత్తశ్వాభిగోప్త్రే ,,
ఉన్మత్తవేషనామధృతే ,,
ఉపద్రవ నివారిణే ,,
ఉపాంశు జపబోధకాయ ,,
ఉమేశమేశయుక్తాత్మనే ,,
ఊర్జితభక్తిలక్షణాయ ,,
ఊర్జితవాక్ప్రదాత్రే ,,
ఊర్ధ్వరేతసే ,,
ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థంభస్మసాత్కరాయ ,,
ఊర్ధ్వగతి విధాత్రే ,,
ఊర్ధ్వబద్ధ ద్వికేతనాయ ,,
ఋజవే ,,
ఋతంభరప్రజ్ఞాయ ,, 200
ఋణాక్లిష్ట ధనప్రదాయ ,,
ఋణానుబద్ధ జంతూనాం ఋణముక్త్యైఫలప్రదాయ ,,
ఏకాకినే ,,
ఏక భక్తయే ,,

ఓమ్ ఏక వాక్కాయ మానసాయ నమః
ఏకాదశ్యాం స్వభక్తానాం స్వతనోఃకృత నిష్కృతయే ,,
ఏకాక్షర పరజ్ఞానినే ,,
ఏకాత్మ సర్వదేశదృశే ,,
ఏకేశ్వర ప్రతీతయే ,,
ఏకరీత్యా ధృతాఖిలాయ ,,
ఐక్యానందగతద్వంద్వాయ ,,
ఐక్యానంద విధాయకాయ ,,
ఐక్య కృతే ,,
ఐక్య భూతాత్మనే ,,
ఐహికాముష్మికప్రదాయ ,,
ఓంకారాదరాయ ,,
ఓజస్వినే ,,
ఔషధీకృత భస్మదాయ ,,
కథాకీర్తన పద్ధత్యాం నారదానుష్ఠితంస్తువతే ,,
కపర్దే క్లేశ నాశాయ ,,
కబీర్దాసావతారకాయ ,,
కపర్దేపుత్ర రక్షార్థ మనుభూత తదామయాయ ,,
కమలాశ్లిష్టపాదాబ్జాయ ,,

ఓమ్ కమలాయత
లోచనాయ నమః
కందర్ప దర్పవిధ్వంసినే ,,
కమనీయ గుణాలయాయ ,,
కర్తాఽకర్తాన్యథాకర్త్రే ,,
కర్మయుక్తోఽప్యకర్మకృతే ,,
కర్మకృతే ,,
కర్మ నిర్ముక్తాయ ,,
కర్మాఽకర్మ విచక్షణాయ ,,
కర్మబీజక్షయంకర్త్రే ,,
కర్మనిర్మూలనక్షమాయ ,,
కర్మవ్యాధి వ్యపోహినే ,,
కర్మబంధ వినాశకాయ ,,
కలిమలాపహారిణే ,,
కలౌ ప్రత్యక్షదైవతాయ ,,
కలియుగావతారాయ ,,
కల్యుత్థభయ భంజనాయ ,,
కల్యాణానంతనామ్నే ,,
కల్యాణగుణ భూషణాయ ,,
కవిదాస గణత్రాత్రే ,,
కష్టనాశకరౌషధాయ ,,
కాకాదీక్షిత రక్షాయాం
ధురీణోఽహమితీరకాయ ,,

ఓమ్ కానాభీలాదపి
త్రాత్రేనమః
కాననే పానదానకృతే ,,
కామజితే ,,
కామరూపిణే ,,
కామ సంకల్పవర్జితాయ ,,
కామితార్థ ప్రదాత్రే ,,
కామాదిశత్రునాశనాయ ,,
కామ్యకర్మసుసన్యస్తాయ ,,
కామేరాశక్తినాశకాయ ,,
కాలాయ ,,
కాలకాలాయ ,,
కాలాతీతాయ ,,
కాలకృతే ,,
కాలదర్ప వినాశినే ,,
కాలరాతర్జనక్షమాయ ,,
కాలశునకదత్తాన్నం
జ్వరంహరేదితిబ్రువతే ,,
కాలాగ్ని సదృశక్రోధాయ ,,
కాశీరామాసురక్షకాయ ,,
కీర్తి వ్యాప్త దిగంతాయ ,,
కుప్నీవీత కలేబరాయ ,,
కుంభారాగ్ని శిశుత్రాత్రే ,,

ఓమ్ కుష్ఠరోగనివారకాయ నమః
కూటస్థాయ ,,
కృతజ్ఞాయ ,,
కృత్స్నక్షేత్రప్రకాశకాయ ,,
కృత్స్నజ్ఞాయ ,,
కృపాపూర్ణాయ ,,
కృపయాపాలితార్భకాయ ,,
కృష్ణరాధాశివాత్రేయ
మారుతాద్యభిరూపధృతే ,,
కేవలాత్మానుభూతయే ,,
కైవల్యపదనాయకాయ ,,
కోవిదాయ ,,
కోమలాంగాయ ,,
కోపవ్యాజశుభప్రదాయ ,,
కోహమితదివానక్తం
విచారమనుశాసకాయ ,,
క్లిష్టరక్షాధురీణాయ ,,
క్రోధజితే ,,
క్లేశనాశనాయ ,,
గగనసౌక్ష్మ్యవిస్తారాయ ,,
గంభీరమధురస్వనాయ ,,
గంగాతీర నివాసినే ,,

ఓమ్ గంగోత్పత్తి పదాంబుజాయ నమః
గంగాగిరితిఖ్యాత
యతిశ్రేష్ఠేన సంస్థితాయ ,,
గంధపుష్పాక్షతైః
పూజ్యాయ ,,
గతివిదే ,,
గతిసూచకాయ ,,
గహ్వరేష్టపురాణాయ ,,
గర్వమాత్సర్యవర్జితాయ ,,
గాననృత్యవినోదాయ ,,
గాలవణ్కర్ వరప్రదాయ ,,
గిరీశసదృశత్యాగినే ,,
గీతాచార్యాయ ,,
గీతాద్భుతార్థవక్త్రే ,,
గీతారహస్యసంప్రదాయ ,,
గీతాజ్ఞానమయాయ ,,
గీతాపూర్ణోపదేశకాయ 300
గుణాతీతాయ ,,
గుణాత్మనే ,,
గుణదోషవివర్జితాయ ,,
గుణాగుణేషువర్తంత
ఇత్యనాసక్తసుస్థిరాయ ,,

ఓమ్ గుప్తాయ నమః
గుహాహితాయ ,,
గూఢాయ ,,
గుప్తసర్వనిబోధకాయ ,,
గుర్వంఘ్రితీర్థభక్తిశ్చిత్త
దేవాల మితీరయతే ,,
గురవే ,,
గురుతమాయ ,,
గుహ్యాయ ,,
గురుపాదపరాయణాయ ,,
గుర్వీశాంఘ్రిసదాధ్యాత్రే ,,
గురుసంతోషవర్ధనాయ ,,
గురుప్రేమ సమాలబ్ధ
పరిపూర్ణ స్వరూపవతే ,,
గురూపాసనసంసిద్ధాయ ,,
గురుమార్గప్రవర్తకాయ ,,
గుర్వాత్మదేవతాబుద్ధ్యా
బ్రహ్మానందమయాయ ,,
గురోఃసమాధిపార్శ్వస్థ
నింబచ్ఛాయానివాసకృతే ,,
గురువేంకటేశసంప్రాప్త
వస్త్రేష్టికాసదాధృతాయ
నమః

ఓమ్ గురుపరంపరాదిష్టసర్వ
త్యాగపరాయణాయ నమః
గురుపరంపరాప్రాప్త
సచ్చిదానందమూర్తిమతే ,,
గృహహీనమహారాజాయ ,,
గృహమేధిపరాశ్రయాయ ,,
గోపీంస్త్రాతాయథాకృష్ణః
తథానాచ్నేకులావనాయ ,,
గోపాలగుండురాయాది
పుత్రపౌత్రాదివర్ధనాయ ,,
గోష్పదీకృతకష్టాబ్ధయే ,,
గోదావరీతటాగతాయ ,,
చతుర్భుజాయ ,,
చతుర్బాహునివారిత
నృసంకటాయ ,,
చమత్కారైరసంక్లిష్టై
ర్భక్తిజ్ఞానవివర్ధనాయ ,,
చందనాలేపరుష్టానాం
దుష్టానాంధర్షణక్షమాయ ,,
చాందోర్కరాదిభక్తానాం
సదాపాలననిష్ఠితాయ ,,
చరాచర పరివ్యాప్తాయ
నమః

ఓమ్ చర్మదాహే
పృథివ్రక్రియాయ నమః
చావడీభోయాఖ్యపఠేలర్థం
చమత్కారసహాయకృతే ,,
చింతామగ్న హరి(త్రాణే
తస్యాసర్వభారంవహాయ ,,
చిత్రాతిచిత్రచారిత్రాయ ,,
చిన్మయానందాయ ,,
చిరవాసకృతైర్బంధైః
శిర్డిగ్రామ పునర్గతయే ,,
చోరాద్యాహృతవస్తూని
దత్తాన్యేవేతిహర్షితాయ,,
ఛిన్నసంశయాయ ,,
ఛిన్న సంసారబంధనాయ ,,
జగత్పితే ,,
జగన్మాత్రే ,,
జగత్రాత్రే ,,
జగద్ధితాయ ,,
జగత్స్రష్ట్రే ,,
జగత్సాక్షిణే ,,
జగద్వ్యాపినే ,,
జగద్గురవే ,,
జగత్ప్రభవే నమః

ఓమ్ జగన్నాథాయ నమః
జగదేకదివాకరాయ ,,
జగన్మోహచమత్కారాయ ,,
జగన్నాటకసూత్రధృతే ,,
జగన్మంగలకర్త్రే ,,
జగన్మాయేతిబోధకాయ ,,
జడోన్మత్తపిశాచాభో
ప్యంతఃసచ్చిత్సుఖస్థి
తాయ ,,
జన్మబంధ వినిర్ముక్తాయ ,,
జన్మసాఫల్యమంత్రదాయ ,,
జన్మజన్మాంతరజ్ఞాయ ,,
జన్మనాశ రహస్యవిదే ,,
జప్తనామసుసంతుష్ట
హరి(ప్రత్యక్షభావితాయ ,,
జనజల్ప మనాదృత్య
జపసిద్ధమహాద్యుతయే ,,
జపప్రేరిత భక్తాయ ,,
జప్యనామ్నే ,,
జనేశ్వరాయ ,,
జలహీనస్థలే భిన్నభక్తార్థం
జలసృష్టికృతే నమః

ఓమ్ జవరాలీతి మహాలాస సేవనేఽక్లిష్ట మానసాయ నమః
జాతగ్రామాద్గురోర్వాసం తస్మాత్ పూర్వస్థలం వ్రజతే ,,
జాతిభేదోర్మతైర్భేదఇతిభేద తిరస్కృతాయ ,,
జాతివిద్యా ధనైశ్చాపి హీనానార్ద్రహృదావనాయ ,,
జాంబూనద పరిత్యాగినే ,,
జాగరూకావితప్రజాయ ,,
జాయాపత్య గృహక్షేత్ర స్వజనస్వాస్థ్యవర్జితాయ ,,
జితద్వైతమహామోహాయ ,,
జితక్రోధాయ ,,
జితేంద్రియాయ ,,
జితకందర్పదర్పాయ ,,
జితాత్మనే ,,
జితషడ్రిపవే ,,
జీర్ణహూణాలయస్థానే పూర్వజన్మకృతంస్మరతే నమః

ఓమ్ జీర్ణహూణాలయంచాద్య సర్వమర్త్యాలయంకరాయ నమః
జీర్ణవస్త్రసమంమత్వా దేహంత్యక్త్వాసుఖం స్థితాయ ,,
జీర్ణవస్త్రసమంపశ్యన్ త్యక్తదేహంప్రవిష్టవతే ,,
జీవన్ముక్తాయ ,,
జీవానాం ముక్తిసద్గతి దాయకాయ ,,
జ్యోతిశ్శాస్త్ర రహస్యజ్ఞాయ ,,
జ్యోతిర్జ్ఞానప్రదాయ ,,
జ్యోక్చసూర్యందృశా పశ్యతే ,,
జ్ఞానభాస్కరమూర్తిమతే ,,
జ్ఞాతసర్వ రహస్యాయ ,,
జ్ఞాతబ్రహ్మపరాత్పరాయ ,,
జ్ఞానభక్తిప్రదాయ ,,
జ్ఞానవిజ్ఞాన నిశ్చయాయ ,,
జ్ఞానశక్తిసమారూఢాయ ,,
జ్ఞానయోగవ్యవస్థితాయ నమః

ఓమ్జ్ఞానాగ్నిదగ్ధకర్మణే 400
జ్ఞాననిర్ధూతకల్మషాయ నమః
జ్ఞానవైరాగ్యసంధాత్రే ,,
జ్ఞానసంఛిన్నసంశయాయ ,,
జ్ఞానాపాస్త
మహామోహాయ ,,
జ్ఞానీత్యాత్మైవ
నిశ్చయాయ ,,
జ్ఞానేశ్వరీపఠద్దేవప్రతిబంధ
నివారకాయ ,,
జ్ఞానాయ ,,
జ్ఞేయాయ ,,
జ్ఞానగమ్యాయ ,,
జ్ఞాతిసర్వాంతఃకరణమతాయ ,,
జ్యోతిషాంప్రథమజ్యోతిషే ,,
జ్యోతిర్జ్ఞానద్యుతిప్రదాయ ,,
తపస్సందీప్తతేజస్వినే ,,
తప్తకాంచనసన్నిభాయ ,,
తత్త్వజ్ఞానార్థదర్శినే ,,
తత్త్వమస్యాదిలక్షితాయ ,,
తత్త్వవిదే ,,
తత్త్వమూర్తయే ,,
తంద్రాలస్యవివర్జితాయ నమః

ఓమ్తత్త్వమాలాధరాయ ,,
తత్త్వసారవిశారదాయ నమః
తర్జితాంతకదూతాయ ,,
తమసఃపరాయ ,,
తాత్యాగణపతిప్రేష్ఠాయ ,,
తాత్యానూల్కర్గతి
ప్రదాయ ,,
తారకబ్రహ్మనామ్నే ,,
తమోరజోవివర్జితాయ ,,
తామరసదలాక్షాయ ,,
తారాబాయ్యసురక్షకాయ ,,
తిలకపూజితాంఘ్రయే ,,
తిర్యగ్జంతుగతిప్రదాయ ,,
తీర్థీకృతనివాసాయ ,,
తీర్థపాదాయ ,,
తీవ్రభక్తినృసింహాదిభక్తాలీ
భూర్యనుగ్రహాయ ,,
తీవ్రప్రేమవిరాగాప్త
వేంకటేశకృపానిధయే ,,
తుల్యప్రియాఽప్రియాయ ,,
తుల్యనిందాత్మసంస్తుతయే ,,
తుల్యాధికవిహీనాయ ,,
తుష్టసజ్జనసంవృతాయ నమః

ఓమ్ తృప్తాత్మనే నమః
తృషాహీనాయ ,,
తృణీకృతజగద్వ్యసనే ,,
తైలీకృత జలాఘ్రాణదీప సంజ్వలితాలయాయ ,,
త్రికాలజ్ఞాన ,,
త్రిమూర్తయే ,,
త్రిగుణాతీతాయ ,,
త్రియామాయోగనిష్ఠాత్మా దశదిగ్భక్తపాలకాయ ,,
త్రివర్గమోక్షసంధాత్రే ,,
త్రిపుటీరహితస్థితయే ,,
త్రిలోకస్వేచ్ఛసంచారిణే ,,
త్రైలోక్యతిమిరాపహాయ ,,
త్యక్తకర్మఫలాసంగాయ ,,
త్యక్తభోగసదాసుఖినే ,,
త్యక్తదేహాత్మబుద్ధయే ,,
త్యక్తసర్వపరిగ్రహాయ ,,
త్యక్త్వామాయామయం సర్వం స్వేమహిమ్ని సదాస్థితాయ ,,
దండధృతే నమః

ఓమ్ దండనార్హాణాందుష్టవృత్తీర్నివర్తకాయ నమః
దంభదర్పాతిదూరాయ ,,
దక్షిణామూర్తయే ,,
దక్షిణాదానకర్తృభ్యో దశధాప్రతిదాయకాయ ,,
దక్షిణాప్రార్థనద్వారా శుభకృత్తత్త్వబోధకాయ ,,
దయాపరాయ ,,
దయాసింధవే ,,
దత్తాత్రేయాయ ,,
దరిద్రోయం ధనీవేతి భేదాచారవివర్జితాయ ,,
దహారాకాశభాసవే ,,
దగ్ధహస్తార్భకావనాయ ,,
దారిద్ర్యదుఃఖభీతిఘ్నాయ ,,
దామోదరవరప్రదాయ ,,
దాసశౌండాయ ,,
దాంతాయ ,,
దాసైఃచాన్యైః వశంనయతే ,,
దానమార్గస్థలత్రాపద. నానాచందోర్కరావనాయ నమః

ఓం దివ్యజ్ఞానప్రదాయ నమః
దివ్యమంగలవిగ్రహాయ ,,
దీనదయాపరాయ ,,
దీర్ఘదృశే ,,
దీనవత్సలాయ ,,
దుష్టానాందమనేశక్తాయ ,,
దురాధర్ష తపోబలాయ ,,
దుర్భిక్షేష్వన్నదాత్రే ,,
దురదృష్టవినాశకృతే ,,
దుఃఖశోకభయద్వేష
మోహాద్యశుభ
నాశకాయ ,,
దుష్టనిగ్రహశిష్టానుగ్రహ
రూప మహావ్రతాయ ,,
దుష్టమూర్ఖజడాదీనా
మప్రకాశస్వరూపవతే ,,
దుష్టజంతుపరిత్రాత్రే ,,
దూరవర్తిసమస్తదృశే ,,
దృశ్యంనశ్యంనవిశ్వాస్య
మితి బుద్ధిప్రబోధకాయ ,,
దృశ్యంసర్వంహిచైతన్య
మిత్యానందప్రతిష్ఠితాయ ,,
దేహేవిగలితాశాయ నమః

ఓం దేహయాత్రార్థ
మన్నభుజే నమః
దేహోగేహంతతోమాంతు
నిస్యేగురుకిరీటకాయ ,,
దేహాత్మబుద్ధిహీనాయ ,,
దేహమోహప్రభంజ
నాయ ,,
దేహోదేవాలయస్తస్మిన్
దేవంపశ్యేత్యుదీరయతే ,,
దైవీసంపత్ప్రపూర్ణాయ ,,
దేశోద్ధారకసహాయకృతే ,,
ద్వంద్వమోహవినిర్ముక్తాయ ,,
దంద్వాతీతవిమత్సరాయ 500
ద్వారకామాయివాసినే నమః
ద్వేషద్రోహవివర్జితాయ ,,
ద్వైతాద్వైత విశిష్టాదీన్
కాలేస్థానేవిబోధకాయ ,,
ధనహీనాధనాఢ్యాంశ్చ
సమదృష్ట్యైవరక్షకాయ ,,
ధనదేవసమత్యాగినే ,,
ధరణీధరసన్నిభాయ ,,
ధర్మజ్ఞాయ ,,
ధర్మసేతవే నమః

ఓం ధర్మస్థాపనసంభవాయ ,,
ధుమాలు పాసనీపతోక్ష
నిర్యాణేసద్గతిప్రదాయ నమః
ధూపఖేడాపటేల్
చాంద్ భాయ్ నష్టాశ్వస్థాన
సూచకాయ ,,
ధూమయానపతత్సాధ్వే
వారపత్నీసురక్షకాయ ,,
ధ్యానావస్థితచేతసే ,,
ధృత్యుత్సాహ
సమన్వితాయ ,,
నతజనావనాయ ,,
నరలోకమనోరమాయ ,,
నష్టదృష్టిప్రదాత్రే ,,
నరలోకవిడంబనాయ ,,
నాగసర్పమయూరేచ
సమారూఢషడాననాయ ,,
నానాచాందోర్కర్
మాహూయతత్సద్గత్యై
కృతోద్యమాయ ,,
నానానిమోన్కరస్యాంతే
స్వాంఘ్రిధ్యాన
లయప్రదాయ నమః

ఓం నానాదేశాభిధా
కారాయ నమః
నానావిధసమర్చితాయ ,,
నారాయణమహారాజ
సంశ్లాఘితపదాంబు
జాయ ,,
నారాయణపరాయ ,,
నామసజ్జితాయ ,,
నిగృహీతేంద్రియ
గ్రామాయ ,,
నిగమాగమగోచరాయ ,,
నిత్యసర్వగతిస్థాణవే ,,
నిత్యతృప్తాయ ,,
నిరాశ్రయాయ ,,
నిత్యాన్నదానధర్మిష్ఠాయ ,,
నిత్యానందప్రవాహకాయ ,,
నిత్యమంగలధామ్నే ,,
నిత్యాగ్నిహోత్ర
వర్ధనాయ ,,
నిత్యకర్మనియోక్త్రే ,,
నిత్యసత్వస్థితాయ ,,
నింబపాదపమూలస్థాయ ,,
నిరంతరాగ్నిరక్షిత్రే నమః

ఓమ్ నిస్పృహాయ నమః
నిర్వికల్పాయ ,,
నిరంకుశగతాగతయే ,,
నిర్జితకామనాదోషాయ ,,
నిరాశాయ ,,
నిరంజనాయ ,,
నిర్వికల్పసమాధిస్థాయ ,,
నిరపేక్షాయ ,,
నిర్గుణాయ ,,
నిర్ద్వంద్వాయ ,,
నిత్యసత్వస్థాయ ,,
నిర్వికారాయ ,,
నిశ్చలాయ ,,
నిరాలంబాయ ,,
నిరాకారాయ ,,
నివృత్తగుణదోషకాయ ,,
నూల్కరవిజయానంద
మాహిపాద్ద త్తసద్గతయే ,,
నృసింహగణూదాసదత్త
పరిచారసాధనాయ ,,
నైష్ఠిక బ్రహ్మచర్యాయ ,,
నైష్కర్మ్యపరినిష్ఠితాయ ,,
పండరీపాండురంగాఖ్యాయ ,,

ఓమ్ పటేల్ తాత్యాజి
మాతులాయ నమః
పతితపావనాయ ,,
పత్రీగ్రామసముద్భవాయ ,,
పదవిస్పృష్టగంగాంభసే ,,
పరబ్రహ్మస్వరూపిణే ,,
పరమకరుణాలయాయ ,,
పరతత్త్వప్రదీపాయ ,,
పరమార్థనివేదకాయ ,,
పరమానందనిస్యందాయ ,,
పరంజ్యోతిషే ,,
పరాత్పరాయ ,,
పరమేష్ఠినే ,,
పరంధామ్నే ,,
పరాయ ,,
పరమేశ్వరాయ ,,
పరమసద్గురవే ,,
పరమాచార్యాయ ,,
పరధర్మభయాద్భక్తాన్
స్వే స్వేధర్మేనియోజ
కాయ ,,
పరార్థైకాంత
సంభూతాయ నమః

ఓమ్ పరమాత్మనే నమః
పదాగతయే ,,
పాపతాపౌఘసంహారిణే ,,
పామరవ్యాజపండితాయ ,,
పాపాద్దాసరసమాకృష్య
పుణ్యమార్గేప్రవర్తకాయ ,,
పిపీలికాముఖాన్నదాయ ,,
పిశాచేష్వప్యవస్థితాయ ,,
పుత్రకామేష్టియాగాదే;
ఋతేసంతానవర్ధనాయ ,,
పునరుజ్జీవితప్రేతాయ ,,
పునరావృత్తినాశకాయ ,,
పునఃపునరిహాగమ్య
భక్తేభ్యఃసద్గతిప్రదాయ ,,
పుండరీకాయతాక్షాయ ,,
పుణ్యశ్రవణకీర్తనాయ ,,
పురందరాదిభక్తాగ్ర్య
పరిత్రాణధురంధరాయ ,,
పురాణపురుషాయ ,,
పురీశాయ ,,
పురుషోత్తమాయ ,,
పూజాపరాఙ్ముఖాయ ,,
పూర్ణాయ నమః

ఓమ్ పూర్ణవైరాగ్య
శోభితాయ నమః
పూర్ణానందస్వరూపిణే 600
పూర్ణకృపానిధయే నమః
పూర్ణకామాయ ,,
పూర్ణచంద్రసమాహ్లాదినే ,,
పూర్వజాయ ,,
ప్రణతపాలనోద్యుక్తాయ ,,
ప్రణతార్తిహరాయ ,,
ప్రత్యక్షదేవతామూర్తయే,,
ప్రత్యగాత్మనిదర్శకాయ ,,
ప్రపన్నపారిజాతాయ ,,
ప్రపన్నానాంపరాగతయే ,,
ప్రమాణాతీతచిన్మూర్తయే,,
ప్రమాదాభిధ-మృత్యుజితే,,
ప్రసన్నవదనాయ ,,
ప్రసాదాభిముఖద్యుతయే ,,
ప్రశస్తవాచే ,,
ప్రశాంతాత్మనే ,,
ప్రియసత్యముదాహరతే ,,
ప్రేమదాయ ,,
ప్రేమవశ్యాయ ,,
ప్రేమమార్గైకసాధనాయనమః

ఓమ్ బహురూప నిగూఢాత్మనే నమః
బలదృప్తదమక్షమాయ ,,
బలాతీదర్పభయ్యాజి
మహాగర్వవిభంజనాయ ,,
బుధసంతోషదాయ ,,
బుద్ధాయ ,,
బుధజనావనాయ ,,
బృహద్బంధవిమోక్త్రే ,,
బృహద్భారవహక్షమాయ ,,
బ్రహ్మకులసముద్భవాయ ,,
బ్రహ్మచారివ్రతస్థితాయ ..
బ్రహ్మానందామృతే
మగ్నాయ ..
బ్రహ్మానందాయ ..
బ్రహ్మానందలసద్దృష్టయే ..
బ్రహ్మవాదినే ..
బ్రహ్మవర్చసే ..
బ్రాహ్మణస్త్రీవిసృష్టోగ్ర
తర్జితశ్వాకృతయే ..
బ్రాహ్మణానాం
మాసోధిష్ఠాయ ..
బ్రహ్మణ్యాయ నమః

ఓమ్ బ్రహ్మవిత్తమాయ నమః
భక్తదాసగణాప్రాణమాన
వృత్త్యాదిరక్షకాయ ..
భక్తాత్యంతహితైషిణే ..
భక్తాశ్రితదయాపరాయ ..
భక్తార్థంధృతదేహాయ ..
భక్తార్థందగ్ధహస్తాయ ..
భక్తపరాగతయే ..
భక్తవత్సలాయ ..
భక్తమానసవాసినే ..
భక్తాతిసులభాయ ..
భక్తభవాబ్ధిపోతాయ ..
భగవతే ..
భజతాంసుహృదే ..
భక్తసర్వస్వహారిణే ..
భక్తానుగ్రహకాతరాయ ..
భక్తరాస్న్యాదిసర్వోగ్ర
మహాఘోరభయ
సంప్రదాయ ..
భక్తావనసమర్థాయ ..
భక్తావనధురంధరాయ ..
భక్తభావపరాధీనాత్మనే ..
భక్తాత్యంతహితౌషధాయ ..

ఓం భక్తావనప్రతిజ్ఞాయ నమః
భజతామిష్టకామదుహే ,,
భక్తహృత్పద్మవాసినే ,,
భక్తిమార్గప్రదర్శకాయ ,,
భక్తాశయవిహారిణే ,,
భక్తసర్వమలాపహాయ ,,
భక్తబోధైకనిష్ఠాయ ,,
భక్తానాంసద్గతిప్రదాయ ,,
భద్రమార్గప్రదర్శినే ,,
భద్రంభద్రమితిబ్రువతే ,,
భద్రశ్రవసే ,,
భన్నామాయీసాధ్వీ
మహితశాసనాయ ,,
భయసంత్రస్తకాపర్దే-
మోఘాభయ
వరప్రదాయ ,,
భయహీనాయ ,,
భయత్రాత్రే ,,
భయకృతే ,,
భయనాశనాయ ,,
భవవారిధిపోతాయ ,,
భవలుంఠనకోవిదాయ నమః

ఓం భస్మదాననిరస్తాధివ్యాధి
దుఃఖాశుభాఖిలాయ నమః
భస్మసాత్కృతభక్తారయే ,,
భస్మసాత్కృతమన్మథాయ ,,
భస్మపూతమహోధిష్ఠాయ ,,
భస్మదగ్ధాఖిలామయాయ ,,
భాగోజీకుష్ఠరోగఘ్నాయ ,,
భాషాఖిలసువేదితాయ ,,
భాష్యకృతే ,,
భావగమ్యాయ ,,
భారసర్వపరిగ్రహాయ ,,
భాగవతసహాయాయ ,,
భావనాశూన్యతఃసుఖినే ,,
భాగవతప్రధానాయ ,,
భాగవతోత్తమాయ ,,
భాటేద్వేషంసమాకృష్య
భక్తింతస్మైప్రదత్తవతే ,,
భిల్లరూపేణదత్తాంభసే ,,
భిక్షాన్నదానశేషభుజే ,,
భిక్షాధర్మమహారాజాయ ,,
భిక్షౌఘదత్తభోజనాయ ,,
భీమాజీక్షయపాపఘ్నే ,,
భీమబలాన్వితాయ నమః

ఓం భీతానాంభీతినాశినే నమః
భీషణభీషణాయ 700
భీషాచాలితసూర్యాగ్ని
మఘవన్మృత్యు
మారుతాయ ,,
భక్తిముక్తిప్రదాత్రే ,,
భుజగాద్రిక్షితప్రజాయ ,,
భుజంగరూపమావిశ్య
సహస్రజనపూజితాయ ,,
భుక్త్వాభోజనదాతౄణాం
దగ్ధపాత్రకృత్తరాశుభాయ,,
భూటిద్వారాగృహంబధ్వా
కృతసర్వమతాలయాయ,,
భూభృత్సమోపకారిణే ,,
భూమ్నే ,,
భూశయాయ ,,
భూతశరణ్యభూతాయ ,,
భూతాత్మనే ,,
భూతభావనాయ ,,
భూతప్రేతపిశాచాదీన్ధర్మ
మార్గేనియోజయతే ,,
భృత్యస్యభృత్యసేవాకృతే ,,
భృత్యభారవహాయ నమః

ఓం భేకంసత్రవరం స్మృత్వా
సర్పాస్యాదపిరక్షకాయనమః
భోగైశ్వర్యేష్వసక్తాత్మనే ,,
భైషజ్యేభిషజాంవరాయ ,,
మర్కటరూపేణభక్తస్య
రక్షణేతేనతాటితాయ ,,
మంత్రఘోషమఠాధిష్ఠాయ,
మదాభిమానవర్జితాయ ,,
మధుపానభృశాసక్తిందివ్య
శక్త్యావ్యపోహకాయ ,,
మఠాద్ధ్యాంతులసీపూజా
మగ్నిహోత్రంచ
శాసకాయ ,,
మహావాక్యసుధామగ్నాయ,
మహాభాగవతాయ ,,
మహానుభవతేజస్వినే ,,
మహాయోగేశ్వరాయ ,,
మహాభయపరిత్రాత్రే ,,
మహాత్మనే ,,
మహాబలాయ ,,
మాధవరాయదేశపాండే
సఖ్యుఃసాహాయ్యకృతే
నమః

ఓమ్ మానావమానయో
స్తుల్యాయ నమః
మార్గబంధవే ,,
మారుతయే ,,
మాయామానుషరూపేణ
గూఢైశ్వర్యపరాత్పరాయ ,,
మార్గస్థ దేవసత్కారః
కార్య ఇత్యనుశాసితే ,,
మారీగ్రస్తబుటీతారితే ,,
మార్జాలోచ్ఛిష్ట
భోజనాయ ,,
మిరీకరంసర్పగండాత్ దైవా
జ్ఞప్త్యాద్విమోచయతే ,,
మితవాచే ,,
మితభుజే ,,
మిత్రేశత్రౌసదాసమాయ ,,
మీనాతాయిప్రసూత్యర్థం
ప్రేమితాయరథందదతే ,,
ముక్తసంగానహంవాదినే ,,
ముక్తసంసృతిబంధనాయ ,,
ముహుర్ధేవావతారాది
నామోచ్చారణ
నిర్వృతాయ నమః

ఓమ్ మూర్తిపూజానుశాస్త్రే
నమః
మూర్తిమానపిఅమూర్తి
మతే ,,
మాలేశాస్త్రీగురోర్ద్రోలప్
మహారాజస్యమూర్తి
ధృతే ,,
మృతసూనుంసమాకృష్య
పూర్వమాతరియో
జయతే ,,
మృదాలయనివాసినే ,,
మృత్యుభీతిర్వ్యపోహకాయ ,,
మేఘశ్యామాయపూజార్థం
శివలింగముపాహరతే ,,
మోహకలిలతీర్ణాయ ,,
మోహసంశయనాశకాయ ,,
మోహినీరాజపూజాయాం
కుల్కర్ణ్యప్పానియోజ
కాయ ,,
మోక్షమార్గసహాయాయ ,,
మౌనవ్యాఖ్యాప్రబోధ
కాయ ,,
యజ్ఞదానతపోనిష్ఠాయనమః

ఓం యజ్ఞశిష్టాన్నభోజనాయ నమః
యతేంద్రియమనోబుద్ధయే ,,
యతిధర్మనుపాలకాయ ,,
యతో వాచో నివర్తంతే
తదానందసునిష్ఠితాయ ,,
యత్నాతిశయసేవాప్త
గురుపూర్ణకృపాబలాయ ,,
యథేచ్ఛసూక్ష్మసంచారిణే ,,
యథేష్టదానధర్మకృతే ,,
యంత్రారూఢంజగత్సర్వం
మాయయాభ్రామ
యత్ప్రభవే ,,
యమకింకరసంత్రస్త
సామంతస్వసహాయకృతే ,,
యమదూతపరిక్లిష్ట
పురంధరేఽసురక్షకాయ ,,
యమభీతివినాసినే ,,
యవనాలయభూషణాయ ,,
యశసాపిమహారాజాయ ,,
యశఃపూరితభారతాయ ,,
యక్షరక్షఃపిశాచానాం
సాన్నిధ్యాదేవనాశకాయ ,,

ఓం మేయుక్తభోజన
నిద్రాయ నమః
యుగాంతరచరిత్రవిదే ,,
యోగశక్తిజితస్వప్నాయ ,,
యోగమాయా
సమావృతాయ ,,
యోగవీక్షణసందత్త
పరమానందమూర్తిమతే ,,
యోగిహృద్ధ్యాన
గమ్యాయ ,,
యోగక్షేమవహాయ ,,
రథస్థరజతాశ్వేషుహృతే
ష్వమ్లానమానసాయ ,,
రసాయ ,,
రససారజ్ఞాయ ,,
రసనారసజితే ,,
రసోప్యస్యపరందృష్ట్వా
నివర్తితమహాయశసే ,,
రక్షణాత్పోషణాత్సర్వ
పితృమాతృగురుప్రభవే ,,
రాగద్వేషవియుక్తాత్మనే ,,
రాకాచంద్రసమాననాయ ,,
రాజీవలోచనాయ నమః

ఓమ్ రాజభిక్షాభి
  వందితాయ నమః
రామభక్తిప్రపూర్ణాయ ,,
రామరూపప్రదర్శకాయ ,,
రామసారూప్యలబ్ధాయ ,,
రామసాయీతివిశ్రుతాయ ,
రామదూతమయాయ ,,
రామమంత్రోపదేశకాయ ,,
రామమూర్త్యాదిశంకర్త్రే ,,
రాసనేసకులవర్ధనాయ ,,
రుద్రతుల్యప్రకోపాయ 800
రుద్రకోపదమక్షమాయ ,,
రుద్రవిష్ణుకృతాఽభేదాయ ,,
రూపిణీరూప్యమోహజితే ,,
రూపేరూపేచిదాత్మకం
  పశ్యధ్వమితిబోధకాయ ,,
రూపాద్రూపాంతరం
  యాతోఽమృత
    ఇత్యభయప్రదాయ ,,
రేఖేశిరో స్థితాంధస్య
  సతాంగతివిధాయకాయ ,,
రోగదారిద్ర్యదుఃఖాదీన్
  భస్మదానేనవారయతే ,,

ఓమ్ రోదనార్ద్రచిత్తాయ ..
రోమహర్షదవాక్కృతయే ..
లఘ్వాశినే ..
లఘునిద్రాయ ..
లబ్ధాశ్వగ్రామణీస్తుతాయ ..
లగుడోద్ధృతరోహిల్లాస్తంభ
  నాత్ దర్పనాశకాయ ..
లలితాద్భుతచారిత్రాయ ..
లక్ష్మీనారాయణాయ ..
లీలామానుషదేహస్థాయ ..
లీలాఽమానుషకర్మకృతే ..
లేలేశాస్త్రిశ్రుతిప్రీత్యా
  మసూదీవేదఘోషణాయ.
లోకాభిరామాయ ..
లోకేశాయ ..
లోలుపత్వవివర్జితాయ ..
లోకేషువిహరంశ్చాపి
  సచ్చిదానందసంస్థితాయ..
లోణీవార్ణ్యాంగణాదాసం
  మహాఽపాయా
    ద్విమోచకాయ ..
వస్త్రవద్వపురుత్సృజ్యస్వేచ్ఛా
  త్యక్తకళేబరాయ నమః

ఓమ్ సత్త్రవద్దేహముత్సృజ్య
  పునర్దేహంప్రవిష్టవతే నమః
వంధ్యాదోషవిముక్త్యర్థం
  తద్వస్త్రీనారికేలదాయ ,,
వాసుదేవైకసంతుష్టయే ,,
వాదద్వేషమదాఽ
  ప్రియాయ ,,
విద్యావినయసంపన్నాయ ,,
విధేయాత్మనే ,,
వీర్యవతే ,,
వివిక్తదేశసేవినే ,,
విశ్వభావనభావితాయ ,,
విశ్వమంగలమాంగల్యాయ,
విషయాత్సహృదేంద్రి
  యాయ ,,
వీతరాగభయక్రోధాయ ,,
వృద్ధాంధేక్షణసంప్రదాయ,
వేదాంతాంబుజసూర్యాయ,
వేదీస్థాగ్నివివర్ధనాయ ,,
వైరాగ్యపూర్ణచారిత్ర్యాయ,,
వైకుంఠప్రియకర్మకృతే ,,
వైహాయసగతయే ,,
వ్యామోహప్రశమౌషధాయ,

ఓమ్ శత్రుచ్ఛేదైకమంత్రాయ
  నమః
శరణాగతవత్సలాయ ,,
శరణాగతభీమాజీశ్వాన్ధ
  భేకాదిరక్షకాయ ,,
శరీరస్థాఽశరీరస్థాయ ,,
శరీరానేకసంభృతాయ ,,
శశ్వత్పరార్థసర్వేహాయ ,,
శారీరకర్మకేవలాయ ,,
శాశ్వతధర్మగోప్త్రే ,,
శాంతిదాంతివిభూషితాయ,,
శిరస్తంభితగంగాంభసే ,,
శాంతాకారాయ ,,
శిష్టధర్మమనుప్రాప్య
  మౌలానాపాదసేవితాయ,
శివదాయ ,,
శివరూపాయ ,,
శివశక్తియుతాయ ,,
శిరీయానసుతోద్వాహం
  యథోక్తంపరిపూరయతే,,
శీతోష్ణసుఖదుఃఖేషు
  సమాయ ,,
శీతలవాక్సుధాయ నమః

ఓమ్ శిర్డిన్యస్తగురోర్దేహాయ నమః
శిర్డిన్యస్తకళేబరాయ ,,
శుక్లాంబరధరాయ ,,
శుద్ధసత్త్వగుణస్థితాయ ,,
శుద్ధజ్ఞానస్వరూపాయ ,,
శుభాఽశుభవివర్జితాయ ,,
శుభ్రమార్గేణతద్విష్ణోః
పరమంపదంనృణాంనేత్రే ,,
శేలూగుహకుటీవాసినే ,,
శేషశాయినే ,,
శ్రీకంఠాయ ,,
శ్రీకరాయ ,,
శ్రీమతే ,,
శ్రేష్ఠాయ ,,
శ్రేయోవిధాయకాయ ,,
శ్రుతిస్మృతిశిరోరత్న
విభూషితపదాంబుజాయ ,,
శ్రేయాన్‌స్వధర్మఇత్యుక్త్వా
స్వస్వధర్మనియోజకాయ ..
సభారామసశిష్యాయ ..
సకలాశ్రయకామధుహే ..
సగుణనిర్గుణబ్రహ్మణే నమః

ఓమ్ సజ్జనమానసవ్యోమ
రాజమానసుధాకరాయ
నమః
సత్కర్మనిరతాయ ..
సత్సంతానవరప్రదాయ ..
సత్యవ్రతాయ ..
సత్యాయ ..
సత్సులభాన్యదుర్లభాయ ..
సత్యవాచే ..
సత్యసంకల్పాయ ..
సత్యధర్మపరాయణాయ ..
సత్యపరాక్రమాయ ..
సత్యదృష్టే ..
సనాతనాయ ..
సత్యనారాయణాయ ..
సత్యతత్త్వప్రబోధకాయ ..
సత్పురుషాయ ..
సదాచారాయ ..
సదాపరహితేరతాయ ..
సదాక్షిప్తనిజానందాయ ..
సదానందాయ ..
సద్గురవే 900
సదాజనహితోద్యుక్తాయ నమః

ఓమ్ సదాత్మనే నమః
సదాశివాయ ..
సదార్ద్రచిత్తాయ ..
సదారూపిణే ..
సదాశ్రియాయ ..
సదాజితాయ ..
సన్యాసయోగయుక్తాత్మనే ..
సన్మార్గస్థాపనవ్రతాయ ..
సబీజంఫలమాదాయ
నిర్బీజంపరిణామకాయ ..
సమదుఃఖసుఖస్వస్థాయ ..
సమలోష్టాశ్మకాంచనాయ ..
సమస్తసద్గురుశ్రేష్ఠాయ ..
సమానరహితాయ ..
సమాశ్రితజనత్రాణ
వ్రతపాలనతత్పరాయ ..
సముద్రసమగాంభీర్యాయ ..
సంకల్పరహితాయ ..
సంసారతాపహార్యంఘ్రయే ..
సంసారవర్జితాయ ..
సంసారోత్తారనామ్నే ..
సరోజదలకోమలాయ ..
సర్పాదిభయహారిణే నమః

ఓమ్ సర్వరూపేష్వవస్థితాయ
నమః
సర్వకర్మఫలత్యాగినే ..
సర్వత్రసమవస్థితాయ ..
సర్వతఃపాణిపాదాయ ..
సర్వతోఽక్షిశిరోముఖాయ ..
సర్వతఃశ్రుతిమన్మూర్తయే ..
సర్వమావృత్యసంస్థితాయ ..
సర్వధర్మసమత్రాత్రే ..
సర్వధర్మసుపూజితాయ ..
సర్వధర్మాన్ పరిత్యజ్య
గుర్వీశంశరణంగతాయ ..
సర్వధీసాక్షిభూతాయ ..
సర్వనామాభిసూచితాయ ..
సర్వభూతాంతరాత్మనే ..
సర్వభూతాశయస్థితాయ ..
సర్వభూతాదివాసాయ ..
సర్వభూతహితేరతాయ ..
సర్వభూతాత్మభూతాత్మనే ..
సర్వభూతసుహృదే ..
సర్వభూతనిశోన్నిద్రాయ ..
సర్వభూతసమాదృతాయ ..
సర్వజ్ఞాయ నమః

ఓమ్ సర్వవిదే నమః
సర్వస్మై ..
సర్వమతసుసమ్మతాయ ..
సర్వంబ్రహ్మమయంద్రష్ట్రే ..
సర్వశక్త్యుపబృంహితాయ ..
సర్వసంకల్పసన్న్యాసినే ..
సంగవివర్జితాయ ..
సర్వలోకశరణ్యాయ ..
సర్వలోకమహేశ్వరాయ ..
సర్వేశాయ ..
సర్వరూపిణే ..
సర్వశత్రునిబర్హణాయ ,,
సర్వైశ్వర్యైకమంత్రాయ ,,
సర్వేప్సితఫలప్రదాయ ,,
సర్వోపకారకారిణే ,,
సర్వోపాస్యపదాంబుజాయ ,,
సహస్రశీర్షమూర్తయే ,,
సహస్రాక్షాయ ,,
సహస్రపాదే ,,
సహస్రనామవిశ్వాసినే ,,
సహస్రనామలక్షితాయ ,,
సాకారోఽపినిరాకారాయ
నమః

ఓమ్ సాకారార్చాసుమాని
తాయ నమః
సాధుజనపరిత్రాత్రే ,,
సాధుపోషకాయ ,,
సాలోకసార్ష్టిసామీప్య
సాయుజ్యపదదాయకాయ ,,
సాయీరామాయ ,,
సాయీనాథాయ ,,
సాయీశాయ ,,
సాయిసత్తమాయ ,,
సాక్షాత్కృతహరిప్రీత్యా
సర్వశక్తియుతాయ ,,
సాక్షాత్కారప్రదాత్రే ,,
సాక్షాన్మన్మథమర్దనాయ ,,
సాయినే ,,
సాయిదేవాయ ,,
సిద్ధేశాయ ,,
సిద్ధసంకల్పాయ ,,
సిద్ధిదాయ ,,
సిద్ధవాఙ్ముఖాయ ,,
సుకృతదుష్కృతాతీతాయ ,,
సుఖేషువిగతస్పృహాయ ,,
సుఖదుఃఖసమాయ నమః

ఓమ్ సుధాస్యందిముఖో జ్జ్వలాయ నమః
స్వేచ్ఛామాత్ర జడద్దేహాయ ,,
స్వేచ్ఛోపాత్తతనవే ,,
స్వీకృతభక్తరోగాయ ,,
స్వేమహిమ్ని ప్రతిష్ఠితాయ ,,
హరిసాతేంతథానానాం
కామదేవపరిరక్షకాయ ,,
హర్షామర్ష భయోద్వేగైః
నిర్ముక్తవిమలాశయాయ ,,
ఓమ్ హిందూముస్లిం సమూహైక్యమైత్రీకరణ తత్పరాయ నమః.
హుం కారేణైవసుక్షిప్రం
స్తబ్ధప్రచండమారుతాయ,
హృదయగ్రంథిభేదినే ,,
హృదయగ్రంథివర్జితాయ ,,
క్షాంతానంతదాసజన్యాయ ,,
క్షితిపాలాదిసేవితాయ ,,
క్షిప్రప్రసాదదాత్రే ,,
క్షేత్రీకృతస్వశిర్డీకాయ 1000

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు
శ్రీ సాయిబాబా మహరాజాయ నమః

శ్రీ సాయినాథ సహస్ర నామావళి
సమాప్తము.



# శ్రీ సాయిబాబా త్రికాలసేవ

(గేయములు)

## 1 ప్రభాతసేవ

౧

ధన్యాసి ఆదితాళము

సాయి! సాయి! శ్రీసాయీ! సాయీ!
సాయీ! శ్రితజన ఆయీ! సాయి॥

సాయీ! సాయీ! ద్వారక మాయీ
సాయీ బాబా! బాబా సాయీ!
భక్తజనావన! సాయీ! సాయీ!
ముక్తివిధాయక! సాయీ! సాయీ! సాయి॥

అగణిత గుణగణ! సాయీ! సాయీ!
నిగమాంతస్థిత! సాయీ! సాయీ!
కారుణ్యాత్మక! సాయీ! సాయీ!
దారిద్ర్యాంతక! సాయీ! సాయీ! సాయి॥

కారణ పురుషా! సాయీ! సాయీ!
ధీరవిహారా! సాయీ! సాయీ!
అనంతరూపా! సాయీ! సాయీ!
అనాధరక్షక! సాయీ! సాయీ! సాయి॥

జగదభివందిత! సాయీ! సాయీ!
నిగమ గుహాలయ! సాయీ! సాయీ!
సద్గతిదాయక! సాయీ! సాయీ.
చిద్గగనస్థిత! సాయీ! సాయీ! సాయి॥

శ్రితజనపోషక! సాయీ! సాయీ!
పతితోద్ధారక! సాయీ! సాయీ!
వినుతచరిత్రా! సాయీ! సాయీ!
హనుమత్త్రాతా! సాయీ! సాయీ! సా॥

౭

సింహేంద్రమధ్యమము ఆదితాళము

శరణము నీయవె! - సాయీ దేవా!
దురితము లడపవె! - సురుచిరభావా!
కరములమోడ్చి నీ - చరణంబుల దరి
శిరమునిలిపి నుతిఁ - జేసెద మరి - మరి శరణము॥
దేవా! సద్గురు! - తేర్చవె! - వినతు,
నే వెరవెఱుఁగను - బ్రోవవె! సంశ్రితు. శరణము॥
గుణములు లేనవ - గుణుఁడని త్రోయక
మనవి వినంగదె! - ప్రణతోద్ధారక. శరణము॥
నీ పదాబ్జముల - నీడ వసింపఁగ
ఈ పాపికి నిర - వీయవె! సుభగ! శరణము॥
సాహస మీతని - సంకల్పంబని
మోహాంబుధిని - ముంచకు వీనిని శరణము॥
సాయీ! యిడవె! నీ - చరణ స్మరణము,
పాయక కూర్పవె! - భవ సంతరణము. శరణము॥
సకలము నీవని - శరణముఁ జేసెద,
అకలంకా! శ్రిత - హనుమన్నుతపద! శరణము॥

3

భాగేశ్వరి ఆటతాళము

మేలుకో పండరినాథ! దయాంబుధీ!
మేలుకో శ్రీ పాండురంగ! మేలుకో. మేలుకో॥

సాధుసజ్జనములు - సకల భక్తవరులు
మాధవ! నినుజూచు - మతి వేచినారలు. మేలుకో॥

నిద్రాసుఖంబు తం - ద్రీ! యింకఁ జాలించు,
భద్రములిడు ముఖ - పద్మమ్ముఁ జూపించు. మేలుకో॥

రంగమంటప మాది - ప్రభు! ద్వారము వరకు
పొంగుచు భక్తులు - ప్రోవైరి నీకొఱకు. మేలుకో॥

అమ్మా! రుకుమాబాయి! నమ్మిన ప్రేమ, లో
కమ్ముల యేలికను - లెమ్మనవే! చెవిలో. మేలుకో॥

దివినుండి సురలెల్ల - వివిధోపాయనములు
తవిలి ప్రేమవిడఁ - దగ వేచినారలు. మేలుకో॥

గరుడ హనుమంతులు - కరముల జోడించి,
దరిశనములకై - తగ నిల్చిరి పొంచి. మేలుకో॥

ద్వారముల్ తెఱవ, మా - కోరిక లీడేరె
పారసాక్షునకు పం - చారతి నిడ రారె! మేలుకో॥

౮

నాదనామక్రియ మిశ్రమజాతి-ఏకతాళము

మేలుకో! శ్రీ సాయీ! - మేలుకో రాంసాయీ!
మేలుకో! ద్వారక - పాలకృష్ణ సాయీ!

మేలుకో - నా సామి! - మేలుకో - శ్రితకామి!
మేలుకో - ప్రేమ మ - మ్మేలుకో - ప్రేమి! మేలుకో॥

శ్యాముఁడు - మాహ - ల్సాపతి - తాత్యాలు
ప్రేమ నీ చెంగట - వినుతించు వారలు మేలుకో॥

చందపర్కరన్న - సాహెబుల్ నీ పద
వందనములు సేయ - వచ్చినారిదె - శ్రీద! మేలుకో॥

దాసుగణూ - శ్రీనివాసుఁడ వగు ని
న్నాసక్తిఁ గీర్తించు - నదె, కను నెమ్మిని. మేలుకో॥

దూరమనక డాసి - కోరి నీదు చరణ
సారసముల మ్రొక్క - జనులఁ గనవె! కరుణ. మేలుకో॥

భక్త చింతామణీ! - ముక్తిదాత నీవ
వ్యక్తి మ్రొక్క హనుమ - వమ్మతిఁ బ్రోవ. మేలుకో॥

౫౯

సింధుభైరవి ఏకతాళము

నాథా సాయీ! మేల్కొనవే చర -
ణాబ్జంబుల దర్శన మీవే!
ఆధివ్యాధుల భవతాపము వే -
యడచి జడుల మముం దేర్పంగదవే. నాథా॥

మాయాశ్రితుడ వగుదువు సాయీ!
మాయను బడి యటమటింతు మోయీ!
మాయను ద్రోయు సమర్థతఁ గన మీ
మాయా బంధము మాపవె సామీ! నాథా॥

సాయీ నాథా! సద్గురు రాజా!
సంసృతి రజనీ శత రవితేజా!
నీ యపార మహనీయ సమర్థత
లేమనగలమో హితసుఖ దాతా! నాథా॥

నలువ యుగవులను చిలువ తేడును
పలికి పలికి ని న్నలసిరి తుదను
తెలియఁజేయఁగదె దేవ! నీ మహిమను
మెలపవె సత్పథి మీ సంశ్రితులను. నాథా॥

సుందరముఖ రుచిఁజూడ - సుధా ని
ష్యందన వచనము లా ద్రుతిఁగ్రోలి,
సందర్శన కాంక్షను సంశ్రిత జన
బృందము నీకై వేచిరి వెలుపల. నాథా॥

దీన దయాళూ! - దీన జనావన!
దీనబంధు! పరి - దేవనమును విను,
జానగు నీ ముఖ సరసీజంబును
సాయి! చూపి మము - సాకవె! కృపను. నాథా॥

నీ మృదు మధుర వి - నిర్మల వాక్కుల
వ్యామోహంబును - బాపవె! దేవా!
ఈ మా బరువు లి - వే నీ పైనిడి
యెంతయు శ్రమఁగల్పించితి మభవా! నాథా॥

మా ప్రార్థనము స - మాలించియు నీ
మహిత రూప సం - పదఁ జూపింపుము
క్షిప్రప్రద! పద - సేవకు హామమను
జేకొని ధన్యునిఁజేసి గ్రహింపుము. నాథా॥

## శ్రీ సాయినాథ ప్రభాతాష్టకము

ఉ

పే వెలుంగుల ఁదేని కాంతుల వెల్లఁబాతె దిగంతముల్
పావనంపు ప్రభాత వేళల భక్తి సద్గురు కీర్తనల్
సేవచేయు జనాళి దోష మశేషమై విలయంబగుఁగా
దేవ! సాయి! సమర్థ సద్గురు! తేర్పవే! దరిఁజేర్పవే! ౧

భానుకాంతి తమంబడంచును; బాపు సద్గురుదేవుఁ డ
జ్ఞానముఁగా; దమసంబుకమ్మఁబఁగల్గు; సద్గురుపేరిమ య
జ్ఞానముఁగాగన నీదు; సద్గురుసాటి యెట్లగు భానుఁడెం
దేని? సాయి! సమర్థ సద్గురు! తేర్పవే! దరిఁజేర్పవే! ౨

భూమి, సోమరిపోతుడంచును బొల్చు భానుఁడు; దుష్ట చే
ష్టామతిన్ బొలఁగించి వైశమ సద్గురుం దభిమాన ము
ద్దామలీలలఁ బాపి, స్వీయపద ప్రసక్తినిఁ గూర్చు స
త్ప్రేమ; సాయి! సమర్థ సద్గురు! తేర్పవే! దరిఁ జేర్పవే! ౩

నీరజాసన విష్ణుశర్వులు నిన్నుబోలఁగఁ జాల, రిం
కేరినే నుపమించి పల్క హసింపలోకము నానుడిన్;
పూరుషోత్తమ! నీవ నీసరి పోలఁ జాలరు; లే దిఁకే
తీరు; సాయి! సమర్థ సద్గురు! తేర్పవే! దరిఁ జేర్పవే! ౪

రావె! నీదుసమాధి వీడి, దొరా! మసీమనకావృతిన్
నీ వచోసుధఁ జిల్కి పీడల నీరువట్టును బాపు; భ
క్తావనాంక! యజాతశత్రు! సమస్త పాతకభంజనా!
దేవ! సాయి! సమర్థ సద్గురు! తేర్పవే! దరిఁ జేర్పవే! ౫

బొర! ద్వారకమాయి విన్ దరహాసరోచులు వెల్గఁగాఁ
గూరుచుంటి శ్రీకాశినిన్ గనుగొంచు నాపదలన్ జమ
త్కారరీతి నడంచుచున్; హితకారి నీసరి లేఁడెటన్
ధీర! సాయి! సమర్థ సద్గురు! తేర్పవే! దరిఁ జేర్పవే! ౬

రక్తివిద్యల నేర్చుఁగాక, చిరంబు శ్రీగురుపాద స
ద్భక్తి సేయక రిక్తవాక్కుల దాటలేఁడు భవాబ్ధి; స
ద్భక్తుకోర్కెలిడున్ గురుండు; కృపజానొసఁగు శ్రీయున్ భయో
ద్రిక్తు; సాయి! సమర్థ సద్గురు! తేర్పవే! దరిఁ జేర్పవే! ౭

అంచితంబగు భక్తి నా హృదయాంబుజంబున నిన్ను ధ్యా
నించనిమ్ము; ప్రపంచమంతయు నీ స్వరూపముగాగ భా
వించి, భూత హితంబులకై బొనరించనిమ్ము; సుబుద్ధి హా
త్తించి, సాయి! సమర్థ సద్గురు! తేర్పవే! దరిఁజేర్పవే! రా

ఫ ల శ్రు తి

"దుష్టసంగతిఁబాసి నాదు శ్రితుండు నిత్యము మత్పరిశా
తాష్టకంబుఁ బఠింప హృద్వ్యథలన్ని పాపుచు, శాంతి సం
తుష్టులకై ఘటియింతు"—నంచు మునుకౌ పరిభుండనుటకౌ పరిశా
తాష్టకంబు, హనూమ, సాయిపదాంకితంబుగ వాకొనెకౌ.

పం చా ర తి

౭

శంకరాభరణము మిశ్రమజాతి త్రిపుట

పంచారతి నీయరె!— శ్రీ సాయికి
పంచారతి నిడరె!— శ్రీ సాయికి.

పంచారతి నిడరె - అంచితముగ భక్త
సంచయములను ర - క్షించు మా తండ్రికి. పంచా॥

పన్నగపతి శాయికి - శ్రితజనా - పన్న హిత సంధాయికి
కన్నన ఓడ్డల - కన్నుతెప్పగ నిల్చి
బన్నములను బాపి - మన్నించు బాబాకు, పంచా॥

ప్రేమ స్వరూపునకు - శిరిడి దివ్య - ధామ నివాసునకు
రామ కృష్ణ హనుమ - భీమ దత్తాత్రేయ
శ్రీమాన్స్వరూపునకు - భూమానందునకు. పంచా॥

## (కాకడ్) ప్రభాత హారతి

౮

శివరంజని ఏకతాళము

ప్రభాత హారతి - భక్త జనప్రియ! - ప్రభూ! యొసంగెద - బాబాసాయీ!
ప్రభావ శోభిత - పరమచిన్మయ - శుభాకారముఁజూపవె! సాయీ! ప॥

శత్రుషట్కమను సూత్రంబుల హ్రా - త్పాత్ర విరక్తి ఘృతంబునఁదడిపి, ప
విత్ర భవత్పద పరమభక్తి వి - చిత్రజ్వాలలఁ జేర్చిన దీప. ప॥

సరవిసకల సం - స్కార వర్తులను- తిరముఁగాల్చి కాంతిని ప్రసరింపుము
పరువడి విభేద-భావముఁబాపుము-పరాత్మైక్య సం-పదఁజేకూర్చుము. ప॥

దివిభువులెల్లెడఁ- దవిలియుందువు - వివిధయోగి హృద్భవనవాసుఁడవు
అవధూతవు ద-త్తాత్రేయుఁడ నీ-వపుడువు శిరిడి నవతరించితివి. ప॥

శిరిడిలో సు-స్థిరముగనుండియు- దూరస్థుల భ-క్తుల వేకన్నులఁ
గూరిమిఁ గాచుచుఁ-గోరికలను సమ-కూరుతువు చమ-త్కారరీతుల. ప॥

శ్రితులయాపదల- సతతముఁబాపుచు- నతులమహామహి- మానుభూతిని
ప్రతిపదమునఁ దో-పగఁజేయుదు దే-వతలేశా నీ నిజ-స్థితిఁగనఁజాలరు.
ప॥

తగ దశదిశలను-నెగడినిండె నీ-యగణితకీర్తి మ-హాస్వనములు నీ
సగుణరూప ద-ర్శనకాంక్షను వా - సిగ నీబిడ్డలు-చేరిరి శిరిడి. ప॥

నీవచనామృత- సేవనమునఁ గను_వైవశ్యతగని- పరితృప్తుల-మహం
భావమడఁచి నీ-పదకమలంబుల_సేవింపఁగ వాం-ఛించెదముప్రభూ! ప॥

ద్వారకమాయీ-వాసా! సాయీ!- సారసాక్ష శ్రిత- పారిజాత! నీ
కా-ణ్యకటా-క్షముఁబఱపుచు నీ-హారతిఁగొనవే! హనుమత్త్రాతా! ప॥

# అక్షయ హారతి

౯

ఆనందభైరవి త్రిస్రజాతి–త్రిపుట

అక్షయ హారతి - అర్పింపరారే!
సాక్షాత్ దైవమగు - సాయీబాబా కెలమి. అక్ష॥

అక్షీణ సద్భక్తి - కుక్షి జనించు ప్ర
త్యక్ష బోధానంద - లక్షిత జ్యోతితో. అక్ష॥

పంచప్రాణములు - పంచవర్తులుగా న
మంచిత జీవితము - నుంచి బాబామ్రోల. అక్ష॥

ద్వారకామాయినిఁ - జేరి భక్తులఁ బ్రోచు
కారుణ్యమూర్తికి - కల్యాణధామునకు. అక్ష॥

ఈ పాపశిరము ప్రభు - శ్రీపాదములఁజేర్చి
చేఁబట్టి పదములు - కాపాడుమని వేడి. అక్ష॥

దరహాసయుత ముఖ - సరసీజమును గని
పరవచనామృత - మరుదారఁ గ్రోలుచు. అక్ష॥

మనసు వాక్తనువు ల - ర్పనముఁగావించుచు
హనుమసేవిత పద - వనజశోభితునకు. అక్ష॥

## సోదర భక్తుల మేలుకొలుపు

౧౦

మోహన ఆదితాళము

జనములార! లేలెండు! స - జ్జనములార! మేల్కొనుండు॥

మనుజ జన్మ మీ - మహి దుర్లభమగు
క్షణభంగురమిది - సాయినిఁ జేరఁగ. జనము॥

ఉదయమున ప్రభుఁడు - నిదుర మేల్కొని
సదయమతిని ద - ర్శనమిడ నుండెను. జనము॥

గురుచరణము లా - దరమతి మ్రొక్కుఁడు
కరుణఁగురియు వీ - క్షణములఁ దోఁగుఁడు. జనము॥

ద్వారకమాయిని - ప్రభాత వేళల
హారతి దర్శన - మఘహర మగు నిల. జనము॥

ద్వారము ముంగల - భేరీ నినదము
హారతిఁ దెలుపుచుఁ - దోరము మొఱసెడి. జనము॥

శిరిడి పుర శో - భారతిఁ గానక
తారసిల్లఁ జే - కూరుదు సద్గతి. జనము॥

వాసుదేవుఁడగు - బాబా పదములు
దాస హనుమ యా - దల వెలుఁగొందెడి. జనము॥

## భజన

౧౧

జననీ! సద్గురు! సాయీ! కనవే!
అనిశము నీదు ప - దాశ్రియ మిడవే!

## ప్రార్థన

౧౨

తిలక్కామోద్ ఏకతాళము

సాయీ! కరుణా - సాగర! యిడుమా
చేయినిఁ, గృప నీ - శిశువును గనుమా! సాయీ॥

మాయా మోహిత - మగు నీ విశ్వము
నీ యాశ్రయమిదు - వీవే శరణము. సాయీ॥

అంధప్రాయుఁడ - బంధితుఁడను, శ్రిత
బంధూ! చేర్చు ప - రంధామము పితః! సాయీ॥

విశ్వరూపుఁడవు - విశ్వనియంతవు
ఆశ్వాసింపవె! - విశ్వత్రాతవు. సాయీ॥

పలికి పలికి తుది - సలసెను రసనము
కలచక హానుమను - గరుణను బ్రోవుము. సాయీ॥

## వినతి

౧౩

భీంప్లాస్ ఆదితాళము

ఎఱుఁగఁజాల సా - యీ! నీతత్త్వము
కరుణలొలుకు కడ - కనులను జూడుము. ఎఱుఁగ॥

తల్లిదండ్రి సో - దరులును నీవే
అల్లనఁ జేయిడి - ఆశ్రయ మిడవే! ఎఱుఁగ॥

భవసాగరమునఁ - బడి దఱినరయను
భవభీతినిఁ బా - పవె! నీ శ్రితుఁడను. ఎఱుఁగ॥

జీవితమంతయుఁ - జెడెనిఁకఁ దుదను
తోఁవఁజూపు చేఁ - దోడయి యీ నను. ఎఱుఁగ॥

ఏడుగడవు సా - యీ! యనిశంబును
వీడక పనిఁగొన - వే! యీ హీనుమను. ఎఱుఁగ॥

## శరణాగతి

౧౮

కన్నడ ఏకతాళము

ఈవుగాక యే - యితరాశ్రియ మే
నెఱుఁగ నెఱుఁగ సా - యీ! గురుదేవా! ఈవు॥

పరమపాపినిఁ - బతితుఁడ దేవా!
కరుణఁ బఱపి రక్షణమిడ రావా! ఈవు॥

ఓరిమిఁ బేరిమి - మేరు తుల్యుఁడవు
ఘోర భవార్ణవ - తారక మగుదువు. ఈవు॥

పామరుఁడను భవ - పాతాళంబున
స్వామి! పడితి నన్నోమవె! కరుణ. ఈవు॥

కరుణ కరము స - త్వర గతి నొసఁగుము
గురు సాయీ! నీ - దఱికిని గొనుము. ఈవు॥

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు
శ్రీ సాయిబాబా మహారాజునకు

జై! జై! జై!

[పరిభాతసేవ సమాప్తము]

---

# ౨ మధ్యాహ్న సేవ

భజన

౧

ద్వారక మాయీ - బాబా సాయీ!
శిరిడి నిలయా! - శేష శాయీ! ద్వారక॥

రాధా మాయీ! - మాధవ సాయీ!
బోధా నందా - ద్భుత శుభ దాయీ! ద్వారక॥

సీతా మాయీ! - శ్రీరఘు సాయీ!
చైతన్యాత్మక - సద్గురు! సాయీ! ద్వారక॥

శాంకరి మాయీ! - శంకర సాయీ!
సంకట హరణ శు - భంకర! సాయీ! ద్వారక॥

రమామాయి! పాండు - రంగా సాయీ!
అమోఘ ఫలదా - యక! శ్రీ సాయీ! ద్వారక॥

దత్తావ ధూతావ - తారా! సాయీ!
ఉత్తమ యోగ మ - హోదధి! సాయీ! ద్వారక॥

హనుమదూ/ప ధ - రా! శ్రీ సాయీ!
హనుమచ్చిత్త వి - హారా! సాయీ! ద్వారక॥

౨

కాంభోజి ఖండగతి

శ్రీ సాయీ! ప్రభు సాయీ! శ్రీరామ సాయి! యని
సేవింపరాదె? - ఓ - మనసా! శ్రీ॥

హరి సాయీ! హర సాయీ! గురు దత్త సాయి!-యని
చింతింపరాదె? - ఓ - మనసా! శ్రీ॥

జమునబాయ్ - నందలాల్ నీ - జననీ జనకులుఁగాగ
తపమేమి చేసిరో?- సాయీ!- తపమేమి చేసిరో? శ్రీ॥

సేవలను గైకొన్న - శ్రీ వేంకుశ గురుఁడు
తపమేమి చేసెనో - సాయీ!- తపమేమి చేసెనో? శ్రీ॥

చేరి నిన్ను సేవింప - శిరిడి జనంబులు
తపమేమి చేసిరో?- సాయీ!- తపమేమి చేసిరో? శ్రీ॥

పదములొత్తుచు చంద - వర్కరానందింపఁ
దపమేమి చేసెనో?- సాయీ!- తపమేమి చేసెనో? శ్రీ॥

నీ లీలలను బాడఁ - దాసు గణుదాసు మును
తపమేమి చేసెనో?- సాయీ!- తపమేమి చేసెనో? శ్రీ॥

ప్రీతిఁ గొలువఁగ నార్కే - పాతే- విమోనకరులు
తపమేమి చేసిరో?-సాయీ!- తపమేమి చేసిరో? శ్రీ॥

నీ మహిమలఁ బలుక - హేమాద్రిపంతు మును
దపమేమి చేసెనో?- సాయీ!- తపమేమి చేసెనో? శ్రీ॥

శ్యామ- తాత్యా- మహ- ల్సాపతు లాశ్రితులు
తపమేమి చేసిరో?- సాయీ!- తపమేమి చేసిరో? శ్రీ॥

బోధమయ్యుఁడు కాశీ - నాథోపాసని బాబా
తపమేమి చేసెనో?- సాయీ!- తపమేమి చేసెనో? శ్రీ॥

సాక్షి! నీ శుభపాద- సన్నిధిఁగన నీ హనుమ
తపమేమి చేసెనో?- సాయీ!- తపమేమి చేసెనో? శ్రీ॥

౩

శంకరాభరణము          మిశ్రచాపు

సాయీ! నను బ్రోవవే!- ద్వారక మాయీ
సాయీ!- నను బ్రోవవే!
సాయీ! నను బ్రోవక - యీ యా దారుల
మాయను భ్రమియింప - జేయుట తగునా?          సాయీ॥
పావన శుభ నామా!- నా ప్రార్థన
పాలింపఁగా భారమా?
ఏ వెరవును గనక - యిట్టిట్టు తిరిగెడి
ఈ వీనిఁ గను వార - లింకెవ్వరయ్యా?          సాయీ॥
కటకట పడఁదగునా?- దేవా! యీ
కుటిలవర్తనుఁ గనిన;
చటుల సంసారాబ్ధి - గుటకలు వేయుచు
నటమటించు వీనిఁ - దటముఁ జేర్పవ కృప?          సాయీ॥
శిరిడిపుర నిలయా!- భక్త హృ-
త్సరసిజ పరమాలయా!
శరణాగతత్రాణ - బిరుదామలాక్షీణ
కరుణా భరణ! నీ - చరణ పరిచరణుని॥          సాయీ॥

శహాన          త్రిశ్రజాతి త్రిపుట

పల్లవి:- "సాయీ!"- యనుచు రసన!- స్మరింపఁగా రాదా?
అ॥ప॥ సాయీ! ద్వారక - మాయీ మందిర
సాయీ! సద్గురు దేవ - సాయీ! మాంపాహి! పాహి!          సాయీ॥

మధుర రసములకు - మఱి మఱి వాంఛింతు
సుధగేరు సాయీ నామ- సుధ రుచిఁజూడు మొకట॥ సాయీ॥

రామా! కృష్ణా! నా - రాయణ! మాధవ!
దామోదరా! హర!. దత్తాత్రేయా! హనుమ! సాయీ॥

ఆధివ్యాధి జనిత - బాధలఁ బోఁదోసి
బోధానంద సత్య - నిధానముఁ బడయ॥ సాయీ॥

జనన మరణములఁ - గనని నెలవుఁజేరి
తనువు మనములును - దవిసి సంతుష్టిఁగన॥ సాయీ॥

౨౧

సింధుభైరవి చతురశ్రగతి

పల్లవి:-మానస! స్మరింపవే!- శ్రీ సాయిని॥ మానస॥

అ॥ప॥ జ్ఞాన గమ్యు - హృ - త్కమల విహారిని
దీన భక్త మం - దిర మందారుని॥ మానస॥

త్యాగ ప్రేమ వి - రాగ మూర్తిని
శ్రీ గౌతమి తట - శిర్డీ నిలయుని॥ మానస॥

వేంకుశ సద్గురు - ప్రేమ పాత్రుని
సంకట హరణు శు - భంకరు సుముఖుని॥ మానస॥

పిలిచిన మాత్రవ - పలుకు సామినిఁ
దలఁచినంత నిజ - దఱియు పరేశుని॥ మానస॥

నిష్ఠ- సబూరిని - నీ వలనను గొని
తుష్టి తృప్తులిడ - తోడ్పడు సామిని॥ మానస॥

## ఉపచార గేయము

౬

మాంఢ్ ఆదితాళము

ఏ పుణ్యముననో - నీ పదసేవన
 మీ పుట్టునఁ బ్రా - పించెను సాయీ!
పాపుఁడు వీఁడని - కోపము నొందక
 చేపట్టితి వా - శ్రితజన మాయీ! ఏపుణ్యము॥
ఎన్ని భవంబుల - పుణ్యమొ! నా యీ
 కన్నులఁ బడితివి - పన్నగశాయీ!
నిన్ను విడువ నీ - కన్న నెవం డా
 పన్న రక్షకుఁడు?- బాబా సాయీ! ఏపుణ్యము॥
గౌతమి జలములఁ - బ్రీతిని దెచ్చితి
 స్నాతునిఁ జేసెద - నయ్యా! సాయీ!
ధౌత వస్త్రమునఁ దడి యొత్తెద - నిదె
 తాల్పవె! మడుఁగులఁ దడయక—సాయీ! ఏపుణ్యము॥
గంధము మేన న - లందెద నీ శ్రమ
 డింద వీవనల - విసరెద, సొబగిం
పొందఁగఁ దిలకం - బు నుపచరించెద
 కుందమాల గళ - మందు నిడెదను॥ ఏపుణ్యము॥
మైత్తని అసన - మిత్తును తండ్రీ!
 ఎత్తు "బాలీసు" ల - ర్పించెద, నగరు
వత్తుల ధూపముఁ - బఱపెద, నిదె, ము
 వ్వత్తులతో దీ - పంబుల నిలిపెద॥ ఏపుణ్యము॥

పళ్ళెరములలోఁ బాక శాకములు
చల్లని నీరము - సాయీ! కూర్చెద
అల్లన నాల్గు వి - ధాన్నంబుల హృది
పల్లవింప సా - పడవే! సాయీ! ఏపున్నెము॥

కర ముఖ పదములఁ గడిగెద, తమ్ములి
మిరవుగ నీ కం - దించెద, మెత్తని
విరులసెజ్జ నర్పించెద, ప్రేమను
చరణములొత్తెద సాయీనాథా! ఏపున్నెము॥

లోక నాథుఁడవు - లోక బంధుఁడవు
నీకంటెను గతి నితరము నెఱుఁగను
నీ కారుణ్యా - లోకనములఁ గని
చేకొను హనుమను - శ్రితజనములను॥ ఏపున్నెము॥

## మధ్యాహ్న హారతి

౭

కేదారగౌళ ఆదితాళము

హారతి గైకొనవే! - సాయీ! - పం - చారతిఁ గైకొనవే!
జన సుఖ దాతా! - సాయీనాథా!
అనుపమ తాత్రితా! - ఆదృతి, మంగళ. హారతి॥
పరమపురుష! బా - బా! శ్రితులము - నీ
చరణ రజమున వి - శ్రాంతి నొసంగుము. హారతి॥
ఇక్షు ధన్వ శి-క్షించిన త్ర్యక్ష! ము
ముక్షుల మిదె, జ్ఞా - నాక్షి నొసంగుము. హారతి॥

భావ సదృశ మను - భవమును గూర్తువు
సేవక జనులకుఁ - జిద్విలాసుఁడవు. హారతి॥
నాథ! నీదు స్మర - ణము భవహర మ; య
గాధ కృతుఁడ, వ - నాథుల దిక్కు-వు. హారతి॥
సగుణబ్రహ్మగ - జనించి తీ భువి
దిగంబర దత్తా - త్రేయమూర్తివి. హారతి॥
ప్రతి గురువారము - ప్రభుపద నతి. నం
స్మృతిహారమని నీ - శ్రితు లెంచెదరు. హారతి॥
సాయీ! నీ పద - సంసేవనము, య
మేయ ధనము. నా - కీయంగదె! దయ. హారతి॥
హనుమ చాతకాజ్ఞ - జ్ఞాన పిపాసను
అణఁపవె సత్కరు - ణామృత వృష్టిని. హారతి॥

## హారతి అనంతర సేవ

రా

శ్యామ ఆదితాళము

పండరి యిది - శిర్డి - పావనమోయీ!
పాండురంగఁ డీ - బాబా సాయీ.
తల్లి 'రుక్మాబాయి' - ద్వారకమాయి
చల్లగ సాకుచు - నతమిడు 'హాయి'.
చంద్రభాగ - యిదె - సాత్విక ప్రేమము
సాంద్రానంద మొసంగును గానము.
పుండరీకు కాపురము - సుభావము;
రండు - రండు - వే రండీ! జనము!

సాయిపాదముల సాఁగిలఁబడుఁడు
చేయి మోడ్పులిడి - చింతలఁ ద్రోయుఁడు.
నా మాటలను వి - నఁగఁబోరేగా - క్షమ
మీ మోసమునకు - మేరలేదు - సుమ!

## భ జ న

౯

సాయీ బాబా! - జననివి నీవే
చేయిడి శ్రితుఁడను - జేకొనఁదవే!

## న మ న

౧౦

తిలక్కామోద్ ఆదితాళము

సాయి! సాయి! శ్రీ - సాయీ! సాయీ!
సాయీ! ద్వారక - మాయీ సాయీ! సాయి॥

సాగిలఁబడి నీ - చరణ కమలముల
బాగుగఁ గరములఁ - బట్టి మ్రొక్కెడు యను
రాగ కలిత నే - త్రంబుల నిను గని
కౌగిలించుకొని - కడు మోదించెద. సాయి॥

నీవే తల్లివి - నీవే తండ్రివి
నీవే బంధుఁడ - వీవే సఖుఁడవు
నీవే విద్యవు - నీవే ధనమును
నీవే సకలము - దైవము - సాయీ! సాయి॥

౧౧

ఆనందభైరవి ఆటతాళము

పల్లవి:- జయదేవ! జయదేవ! జయసాయి దేవ!
సాయీ! సద్గురు దేవ!

అ॥ప॥ భయ హరమగు నీ - పదములదఱిఁ జి
న్మయ! నాదు శిరముంచి - మనసార సేవింతు. జయ॥

చ॥ అవతరింతువు ధర్మ - హాని కల్గినవేళ
హావణింతు సద్భక్తి - నాస్తికులకునేవి
వివిధ లీలలఁబఱపి - విశ్వముఁ బాలింతుఁ
బవలు రేలు దీన - భక్తుల రక్షింతు. జయ॥

పొందుగ యవనులఁ - బుట్టి యేకనాథు
సందియముల భేద - సరణిఁబాపి, గోపి
చందు నుద్ధరించి - చక్కదిద్ది జన
సందోహమునుబ్రోచు - సాయి కబీరువు. జయ॥

ఇఱుమతములు సమ - మేక మభేదము
ఇఱువురదైవము - నేనే, - సత్యము;
పొరపడి కలహింపఁబోలదు మీకని
సరిదిద్దినాఁడవు - సాయీ అవతార! జయ॥

సాయీ! నీపదభక్తి - పలుపు సజ్జనులకు
మీలును దొలఁగించి - మనుతువు పతతము,
నీ యందఁజేరితి - నీ మహత్త్వము పా
రాయణముఁగూర్చి - రక్షింపు హనుమను, జయ॥

## నమస్కారాష్టకము

అనంతా తు లాతే కసేరే స్తవావే । అనంతా తు లాతే కసేరే నమావే
అనంతా ముఖాచా శిణే శేషగాతా । నమస్కార సాష్టాంగ శ్రీసాయినాథా! ౧

స్మరావేమనీ త్వత్పదా నిత్యభావే । ఉరావేతరీభక్తి సాఠీస్వభావే!
తరావే జగా తారునీ మాయితాతా । నమస్కార సాష్టాంగ శ్రీసాయినాథా! ౨

వసే జో సదా దావయా సంతలీలా । దిసే అజ్ఞ లోకాపరీ జో జనాలా
పరీ అంత రీజాన కైవల్యదాతా । నమస్కార సాష్టాంగ శ్రీసాయినాథా! ౩

బరా లా ధలా జన్మ హా మానవాచా - నరా సార్థకా సాధనీభూత సాచా
దరూ సాయిప్రేమా గళా యా అహం తా । నమస్కార సాష్టాంగ
శ్రీసాయినాథా! ౪

ధరా వే కరీ సాన అల్పజ్ఞబాలా । కరా వే అమహా ధన్య చుంబోనిగాలా
ముఖీఘాలప్రేమే ఖరాగ్రాస అతా । నమస్కారసాష్టాంగ శ్రీసాయినాథా! ౫

సురాదీ కజాచ్యా పదావంది తాతీ । శుకాదీక జ్యాతే సమానత్వ దేతీ
పదీ నమ్రతా యే ప్రయాగాదితీర్థే । నమస్కారసాష్టాంగ శ్రీసాయినాథా! ౬

తుర్యాజ్యా పదా పాహతా గోపబాళీ । సదారంగలీ చిత్స్వరూపీ మిళాలీ
కరీ రాసక్రీడా సవే కృష్ణనాథా । నమస్కారసాష్టాంగ శ్రీసాయినాథా! ౭

తు లా మాగతో మాగణే ఏకధ్యావే । కరా జోడితో దీన అత్యంత భావే
భవీ మోహనీరాజ హా తారి ఆతా । నమస్కారసాష్టాంగ శ్రీసాయినాథా! ౮

# నమస్కారాష్టకము (ద్విపద)

౧౨

కన, నపంతుఁడవు - పల్కఁగనౌనె నాకు?
వినతు లనంత! య - ర్పింపఁగా నౌనె?
విను నవంతాస్యుఁడే - నీ బల్కు నోడు
ననఘ! సాయీప్రభూ! - సాష్టాంగ నతులు. ౧
అనిశము నీ పద - ధ్యానంబు నిమ్ము
మననిమ్ము నీదు నా - మ స్మరణమున;
జనని! జనక! నీదు - సన్నిధి నిడవె!
అనఘ! సాయీప్రభూ! - సాష్టాంగ నతులు. ౨
అనుపమ! నీ లీల - లరయంగ లేక
దిన రాత్రములు వృ - థల్ త్రిప్పులఁ గందు;
కనఁబోరు నిను; జ్ఞాన - కైవల్య దాత!
అనఘ! సాయీప్రభూ! - సాష్టాంగ నతులు. ౩
మనుజ జన్మంబను - మహిత భాగ్యంబుఁ
గని, యహంతను బాసి, - కడు ప్రేమఁబఱపి
నినుజేరు సాధన - నెమక మేలగును;
అనఘ! సాయీప్రభూ! - సాష్టాంగ నతులు. ౪
నను నజ్ఞు, శిశువు, మ - న్ననఁ జేత నెత్తి
తనర ముద్దులొసంగి - ధన్యునిఁ జేసి
తనివు నీ కరుణామృ - తముఁ ద్రావ నిడవె!
అనఘ! సాయీప్రభూ! - సాష్టాంగ నతులు. ౫

ప్రణతి సేయుదురు దే - వతలు నీ పదము
నొనర నిన్ను శుకాది - యోగు లర్థింతుర్;
తనరును పుణ్య తీ - ర్థములు నీమ్రోల
ననఘ! సాయీప్రభూ! - సాష్టాంగ నతులు. ౭

అవిరతము నీపద - ధ్యానంబుఁ బడసి
పొనరఁగ నీదు రూ - పున లీనమొంది
కనిరి దాసంబు సౌఖ్యము గొల్లచెలులు
అనఘ! సాయీప్రభూ! - సాష్టాంగ నతులు. ౮

విను శరణొందితి - నీదు సేవకుని
వినతిఁ జేతులుమోడ్చి - వేడు నీదు దీనుఁ
గని ప్రేమ, భవ మహాఽజ్ఞానంబు నడఁపు
మనఘ! సాయీప్రభూ! - సాష్టాంగ నతులు. ౯

## శ్రీ దత్త సాయీ ప్రార్థన

౧౩

మధ్యమావతి     ఏకతాళము.

సాయీనాథా! - సద్గురు దత్తా
శ్రేయా! కరుణను - డాయంగదవే. సాయీ ||

సాక్షి! దిగంబర! - సర్వవ్యాపక!
అక్షయరూపా! - అమల గుణాత్మక!
శ్రుతిసారా! అవ - సూయ కుమారా!
పతితోద్ధారా! - శ్రితమందారా! సాయీ ||

ధ్యాన జపంబులు - సలుపుదు కాశిని
భూనుత కొలహా - పురి భిక్షుగొని
అమల తుంగభ - ద్రాంబులఁ గ్రోలుచు
తమి, మహూరున వి - శ్రమింతు విచ్చలు. సాయీ॥

వ్రేల దాపటను - బిచ్చపు జోలి, త్రి
శూల డమరుకలు - సొబగగు సంకుపుఁ
దాలిచి, శ్రితులను - దగ దీవించుచు
సాలోక్యాదిక - సద్గతు లిడుదువు. సాయీ॥

చరణ యుగంబున - సరి పాదుకలును
కరముల రుద్రా - క్షలు కుండికయును,
హరిణాజిన మిం - పారఁగ వీపున
నురగ కిరీటం - బొనరఁగ శిరమున. సాయీ॥

నిను నిరతము ధ్యా - నించు నెలవులను
ధనదేవత ని - త్యము వసియించును;
అనురాగంబున - ఆశ్రిత జనములఁ
గని వేకన్నులఁ - గాతువు సతతము. సాయీ॥

కరుణామతి మో - క్షముఁ జేకూరుచు
సురుచిర రూపముఁ - జూపంగదె స
ద్గురుదేవా! నీ - చరణంబులు సం
సరణాంబుధి సం - తరణము శ్రితులకు. సాయీ॥

శ్రీ ఉపాసనీబాబా రచిత
శ్రీ సాయినాథ మహిమ్న స్తోత్రము
౧౪

సదా సత్స్వరూపం చిదానంద కందం
జగత్సంభవస్థాన సంహార హేతుం
స్వభక్తేచ్ఛయా మానుషం దర్శయంతం
నమా మీశ్వరం సద్గురుం సాయినాథం॥
భవధ్వాంత విధ్వంస మార్తాండ మీడ్యం
మనోవాగతీతం మునిధ్యాన గమ్యం
జగద్వ్యాపకం నిర్మలం నిర్గుణం త్వాం
నమా మీశ్వరం సద్గురుం సాయినాథం॥
భవాంభోధి మగ్నార్దితానాం జనానాం
స్వపాదాశ్రితానాం స్వభక్తి ప్రియాణాం
సముద్ధారణార్థం కలౌ సంభవంతం
నమామీశ్వరం సద్గురుం సాయినాథం॥
సదా నింబవృక్షస్య మూలాధివాసాత్
సుధా స్రావిణం తిక్త మప్య ప్రియంతం
తరుం కల్పవృక్షాధికం సాధయంతం
నమామీశ్వరం సద్గురుం సాయినాథం॥
సదా కల్పవృక్షస్య తస్యాధిమూలే
భవద్భావ బుద్ధ్యా సపర్యాది సేవాం
నృణాం కుర్వతాం భుక్తి ముక్తిప్రదంతం
నమామీశ్వరం సద్గురుం సాయినాథం॥

అనేకాశ్రితాఽతర్క్య లీలా విలాసైః
సమావిష్కృతేశాన భాస్వ త్ప్రభావం
అహంభావ హీనం ప్రసన్నాత్మ భావం
నమామీశ్వరం సద్గురుం సాయినాథం॥ ౬

సతాం విశ్రమారామ మేవాభిరామం
సదా సజ్జనైః సంస్తుతం సన్న మద్భిః
జనామోద దం భక్త భద్ర ప్రదం తం
నమామీశ్వరం సద్గురుం సాయినాథం॥ ౭

అజన్మాద్య మేకం పరంబ్రహ్మసాక్షాత్
స్వయం సంభవం రామ మేవావతీర్ణమ్
భవద్దర్శనాత్సం పునీతః ప్రభోఽహం
నమామీశ్వరం సద్గురుం సాయినాథం॥ ౮

శ్రీ సాయీశ! కృపానిధేఽఖిలనృణాం సర్వార్థసిద్ధిప్రద!
యుష్మ త్పాదరజఃప్రభావ మతులం - ధాతాఽపి వక్తాఽక్షమః
సద్భక్త్యా శరణం కృతాంజలి పుటః సంప్రాపితోఽస్మి ప్రభో!
శ్రీమత్సాయి పరేశ పాదకమలా న్నాన్యచ్ఛరణ్యం మమ॥ ౯

సాయిరూప ధర రాఘవోత్తమం - భక్తకామ విబుధద్రుమం ప్రభుం
మాయ యోపహత చిత్తశుద్ధయే - చింతయా మ్యహమహర్నిశం ముదా॥ ౧౦

శరత్సుధాంశు ప్రతిమప్రకాశం - కృపాతపత్రం తవ సాయినాథ!
త్వదీయ పాదాబ్జ సమాశ్రితానాం - స్వచ్ఛాయయా తాప మపాకరోతు॥ ౧౧

ఉపాసనాదైవత సాయినాథ - స్తవైర్మయోపాసని నా స్తుత స్త్వం
రమేన్మనో మే తవ పాదపంకజే - భృంగోయథాబ్జే మకరంద లుబ్ధః॥ ౧౨

అనేకజన్మార్జిత పాప సంక్షయో - భవేత్ భవత్పాద సరోజ దర్శనాత్
క్షమస్వసర్వా నపరాధపుంజకాన్ - ప్రసీద సాయీశ! గురోదయానిధే! ౧౩

శ్రీసాయినాథచరణామృతపూర్ణచిత్తా - స్త్వత్పాదసేవనరతాఃసతతంచభక్త్యా
సంసారజన్య దురితౌఘవినిర్గతాస్తే - కైవల్యధామపరమం సము వాప్నువంతి॥

స్తోత్రమే తత్పఠేద్భక్త్యా । యోనర స్తన్మనాః సదా
సద్గురో సాయినాథస్య - కృపాపాత్రం భవేత్ధ్రువం॥ ౧౪

సాయినాథ కృపాస్వర్ధ్రు - సత్పద్య కుసుమావళిః
శ్రేయసేచ మనశ్శుద్ధ్యై - ప్రేమ సూత్రేణ గుంఫితా॥ ౧౬

గోవింద సూరిపుత్రేణ - కాశీనాథాభిధాయినా
ఉపాసనీ త్యుపాఖ్యేన - శ్రీ సాయీ గురవేర్పితా॥ ౧౭

శ్రీ సాయీనాథ మహిమ్నస్తోత్రం

సంపూర్ణము.

## శ్రీ సాయీనాథ మహిమ్న స్తోత్రము (ద్విపద)

౧౪

సతత చిదానంద సత్స్వరూపకుని
వితత సృష్టిస్థితి విలయ కారణుని
ఇల, భక్తతృప్తి కాకృతిఁ బూనువానిఁ
గొలుతు సమర్థసద్గురు సాయివిభుని॥ ౧

ఘన భవ తమస భాస్కరుని నిర్మలుని,
ముని హృదావాసుని భువన విలయునిఁ,
బలుకు దలఁపులఁ జొప్పడని నిర్గుణునిఁ
గొలుతు సమర్థసద్గురు సాయివిభుని॥ ౨

భూరి సంసరణాబ్ధిమునిఁగి వేసారి,
చేరి, స్వపదము లర్చించినవారిఁ
గలి, నుద్ధరింప సాకారుఁడౌ వానిఁ
గొలుతు సమర్థసద్గురు సాయివిభుని॥ 3

నిరతి నింబద్రుమ నీడ వసించి
తరు తిక్తమడఁచి, సుధా రుచుల్ నించి,
అల సురద్రుమ గర్వమడఁచిన వానిఁ
గొలుతు సమర్థసద్గురు సాయివిభుని॥ ౪

ఆ సురద్రుమ మూలమందునఁ జేరి
శ్రీ సాయికలఁడని సేవించువారి
కిల, భుక్తిముక్తుల నిడి సాకు వానిఁ
గొలుతు సమర్థసద్గురు సాయివిభుని॥ ౫

కనని వినని తర్కములకుఁ గాని
ఘన లీలలఁ బరేశు గతిఁ దెల్పువాని,
నిలఁ బ్రసన్నుని నహంకృతి వివర్జితునిఁ
గొలుతు సమర్థసద్గురు సాయివిభుని॥ ౬

సతము పాదులకు విశ్రమ రమ్యవనిని
నత సజ్జన స్తవన ప్రశోభితునిఁ,
దలఁచు భక్తులకు భద్రములిడు హితునిఁ
గొలుతు సమర్థసద్గురు సాయివిభుని॥ ౭

ఆద్యు నభవునిఁ బ్రత్యక్ష కేశవుని
హృద్యు, స్వయంభువు శ్రీరామ సమునిఁ,
దొలి చూడ్కి శ్రితుఁ బవిత్రునిఁ జేయువానిఁ
గొలుతు సమర్థసద్గురు సాయివిభుని॥ ౮

చరణ సేవకులకు సర్వార్థలబ్ధిఁ
బఱపి రక్షింతు, బాబా! కరుణాబ్ధి
సతము నీ చరణ రజఃప్రభావంబు
అతులము, పలుక బ్రహ్మకు నసాధ్యంబు;
కరముల జోడించి కడు భక్తితోడ
చరణంబుఁ జేరితి, సాయి! నీవాఁడ;
పరమేశ శ్రీసాయి పద కమలంబు
శరణ, మన్యమెఱుంగఁజాల సత్యంబు॥ ౯

శ్రీ సాయిరూపుఁడౌ శ్రీరఘూత్తముని
భాసుర భక్తకల్పద్రుమ - ప్రభుని,
మాయా విమోహిత మతి శుద్ధిఁగోరి
రేయింబవళ్ళుఁ బ్రార్థించెదఁ జేరి॥ ౧౦

శరదిందు సుందర సమ శీతకాంతిఁ
బఱపు నీ కరుణాతపత్రింబు; భ్రాంతిఁ
దోఁ్రియు నీ పదరతాత్ములకది; తాత!
ఛాయచేఁ దాపముల్ శమయించుఁగాత! ౧౧

అల ఉపాసని యుపాశ్యమ! సాయిరామ!
తెలిగించె నీ స్తుతిఁగా ద్విపద నీ హనుమ;
సరసిజ మధులుబ్ధ షట్పది విధము
వరలుత నీ పద ద్వయి పీనిమనము॥ ౧౨

కరుణాబ్ధి నీ పద కంజ దర్శనము
పరిమార్చు బహుజన్మ పాపసంచయము;
నపరాధముల సైపుమయ్య! సద్భావ!
కృప నేలి, చేయిదుమీ, సాయిదేవ! ౧౩

శ్రీసాయి సత్పదామృత పూతమతులు
శ్రీసాయిపదభక్తి సేవాభి రతులుఁ
గడఁదోఁ్రసి భవజాత కలుషచయంబుఁ
బడయఁగాఁగలరు కైవల్య ధామంబు॥ ౧౪

నరుఁడు భక్తిని మహిమ్నస్తోత్ర వరము
స్థిరచిత్తుఁడై పఠించెనయేని సతము
పరమ సద్గురు సాయిబాబా నితాంత
కరుణకుఁ బాత్రుఁడై కాంచు నిశ్చింత॥ ౧౫

సాయీకృపా పారిజాత సూతముల
నా యత హృద్య పద్య ప్రసూనముల
ప్రేమ సూత్రమునఁ గూర్చితిని హారంబు
క్షేమ మనఃశుద్ధి సిద్ధి ప్రదంబు॥ ౧౬

సురభాష గోవింద సూరి పుత్రుండు
వర కాశినాథుఁ డుపాస నీద్యుండు.
పలికె; దీనిఁ దెనుంగుబాస నీ హనుమ
పలికి శ్రీసాయి కప్పనసేసెఁ బ్రేమ॥ ౧౭

## ఊధి ప్రభావము

౧౮

బేహాగ్ ఏకతాళము

'ఊధి' ప్రభావం - బొకపరిఁ గనుడీ
వృధా ప్రయాసల - వేసర నేటికి?
ఆధి వ్యాధుల - నన్నిఁటిఁబాపి ని
రామయ సుఖమిడు - నది ముమ్మాటికి॥ ఊధి॥
ద్వారకమాయీ - భవనము ముంగిట
సారసాక్షుఁడగు సాయీనాథుఁడు
కారుణ్య కటా - క్షములను బఱపుచుఁ
జేరువారి కా - శీస్సులతో నిడు॥ ఊధి॥

వేఱ వేఱు దన - బిడ్డల నొయ్యన
జీరుచు వారల - సేవలఁగొని ప్రియ
మారఁగ నొసలం - దలఁదుచు సురుచిర
స్మేరాననుఁడై - చేనిడు నమేయ॥ ఉధి॥
భిషగ్వరులకై - వెదుకగనేలా?
భేషజముల సే - వింపఁగ నేలా?
పోషించును దను - వుల మనముల నని
మిషులకు దుర్లభ - మిది లోకముల॥ ఉధి॥
ధన పదవులఁ వి - ద్యల నందదు ప్రా
క్తన సుకృతంబున గని సాయీ పద
వనజంబుల వి - శ్వాస ప్రేమలఁ -
దనరువారి కం - దఱ కిదిసుఖద॥ ఉధి॥
రండు! రండు! త్వర - రండీ! తను మృ
ద్భాండము లేత్రుటి - వ్రియ్యునో యెఱుఁగము
నిండుప్రేమ సా - యిని సేవింప వ్రి
భుండు హనుమనటు - పోషించును మిము॥ ఉధి॥

శ ర ణా గ తి

౧౭

కాఫీ ఆదితాళము

పల్లవి:-కరుణారస నం - భరిత పరేశా!
అ॥ప॥ శరణాగతుఁడ ర - క్షణమిడు సాయీశా! కరుణా॥
చ॥ ఎఱుఁగఁజాల సా - యీ! సుపథము, నీ
యిరవుఁజేర నే - వెరవుఁ గనను తండ్రి॥ కరుణా॥

పాపుఁడ భవ సం - తాప పీడితుఁడ
నీ పదాబ్జముల - నెఱ నమ్మినవాఁడ॥ కరుణా॥
ఒకపరి నీనామ - ముచ్చరించినమాత్రి
సకలము సమకూర్తు - సత్య చారిత్రి! కరుణా॥
దక్షుఁడ, వార్త నం - రక్షణ నీ దీక్ష
రక్షింపు హనుమను - రాజీవ దలాక్ష! కరుణా॥

## స మ ర్ప ణ

౧౭

తనువుచే వాక్కుచే - తను నింద్రియముల
మనసుచే - బుద్ధిచే - మాయకుణా లోఁగి
నే రచించెడి కృతుల్ - నిఖిలంబు సాయి
నారాయణున కప్ప - నంబుఁ గావింతు॥
రాము శ్రీకృష్ణ నా - రాయణుణా సాయి
దామోదరుణా రమా ధవుని నచ్యుతుని
శ్రీనివాసు ననంతు - శ్రీవాసుదేవు
జానకీపతి రామచంద్రు సేవింతు॥

## నా మ స్మ ర ణ ము

౧౮

1. హరేరామ! హరేరామ! - రామ రామ హరే హరే!
హరే కృష్ణ! హరే కృష్ణ! - కృష్ణ కృష్ణ హరే హరే!
2. శ్రీరామ! జయరామ! జయ! జయ! రామ!
(మూఁడుమారులు చెప్పవలయును)
(మధ్యాహ్నసేవ సమాప్తము)

# 3. రాత్రి సేవ

౧

హిందూస్తాని తోడి    ఆదితాళము

పరాపవాదము - పరిహరింపవే!
    పరార్ధ దాయీ! - బాబా! సాయీ!
నిరంతరంబును - నీ నామంబును
    స్మరింపనీయవె - సద్గురు! సాయీ! పరాప॥

వృధాభిమాన - స్వీయ ప్రశంసల
    కధీను(జేయకు - మయ్యా! సాయీ!
క్రోధా కామ దు - ర్లోభాదుల( గడు
    వ్యధల్ నివారిం - ప(గదే! సాయీ! పరాప॥

సతంబు భూత వి - హితంబు( గూర్చుచు
    ప్రతిప్రాణి నీ - వలె( గననీవే!
ప్రతి క్షణము నీ - ప్రభావచింతన
    మతిఁ ప్రసాదిం - ప(గదే! సాయీ! పరాప॥

ప్రశంసనములకు - నృశంసనములకు
    ప్రశాంత బుద్ధిని( - బడపవె! సాయీ!
ప్రశస్తములౌ నీ - యశోలీల లహ
    ర్నిశల్ స్మరింప(గ - నీయవె! సాయీ! పరాప॥

## గే య ము

౨

మాల్కోస్ ఆదితాళము

శరణు - శరణు శ్రీ - సాయీదేవా!

పరమ కరుణా - భరిత స్వభావా! శర॥

జ్ఞానమ యానంద - స్థాన విహారా!

దీన భక్తావన - దివ్య మందారా! శర॥

మానిత లీలా - మానవాకార!

శ్రీనారాయణ - సిద్ధావతారా! శర॥

సకలభూత హృదయ - సదన నివాసా!

అకలంకాద్భు తా - వ్యయ చిద్విలాస! శర॥

పాహిమాం - పాహిమాం - పాహి - సద్భావ!

త్రాహిమాం - త్రాహిమాం - త్రాహి - గురుదేవ॥ శర॥

ద్వారకమాయీ - భవన విహారా!

సారసాక్ష - హనుమ - స్వాంత సంచారా! శర॥

## మం గ ళ హా ర తి

3

బిల్హరి అటతాళము

హారతి నీయుదము పరాత్మునకు - పం

చారతి నీయుదము - సద్గురుసాయికి॥ హారతి॥

అంచిత వినతి ని - ర్వంచిత భక్తిని

పంచతత్త్వములను - పంచజ్యోతులు వెలుగ॥ హారతి॥

అగుణంబు దానిట్లు - సగుణమై పొడమెడునె!

తగ తల్లి సాయికి సా - ధ్యముగానిదుండునె! హారతి॥

జనని సత్వ రజ స్తమసములకు మాయ
కన మాయనుండి యె - క్కరణిఁబొల్చునామాయ! హారతి॥
ఏడు మున్నీరుల - క్రీడసలుపు మాయ
క్రీడించుచు విశ్వ - సృజనఁజేయు; నమేయ॥ హారతి॥
కారుణ్యాత్మకుఁడు ని - ష్కల్మష హృదయుఁడు
శ్రీరామ సాయి యీ - చిత్రిమెఱిఁగించెడు॥ హారతి॥
ఈ యఖిల విశ్వ - సృజన గతిఁజూపెడు
సాయీ - భోళాసాయి - సర్వసమర్థుఁడు॥ హారతి॥

## జ్ఞానేశ్వర హారతి

౪

అఠాణా ఆటతాళము

జయ హారతి యిదె - జ్ఞాన రాజా!
పరమ మహా కై - వల్య తేజా!
జయ! జయ! సన్నుత - సాధు సమాజా!
స్వాంతే దూపల - శారద రాజా! జయ॥
జ్ఞానము సమసె నీ జగమందునఁగల
సత్యమెఱుంగఁగ - జాలరు జనములు
మానుగ పండరి - మాధవుఁడగు విఠల్
జ్ఞానేశ్వరుఁడై - సమ్మతిఁ బొడమెను॥ జయ॥
పంచిన మతివ్రిజని - తంచినులిట కన
కంబు పళ్ళెరములఁ - గానుకలు తెచ్చిరి
తుంబుర నారదు - లింబుగ సామ గా
నంబుల నీ స్తవ - నంబులు సేతురు॥ జయ॥

మఱుఁగుపడిన యీ - పరమరహస్యము
కరుణను సాయీ - గురుదేవుఁడవై
ఎఱుఁగఁదెలిపితివి - శరణాగత జన
పరిరక్షణ చణ - పాలిత హనుమ! జయ॥

## తుకారాం హారతి

షణ్ముఖప్రియ ఆదితాళము

హారతిఁ గైకొనవే! - తుకారామా!
సాయీ! - సద్గురు ధామా! హారతి॥

అనుపమ! సచ్చి - దానందాత్మక
ఘన తేజంబులఁ - గ్రాలుదు; తోఁయక
నను నీవానిఁ గా - నంగదె! నీపద
వనజంబులఁ గృపఁ - బ్రాపిడి, సుఖద! హారతి॥

రంగుగ శ్రీరఘు - రాముఁడు జలధి త
రంగంబులఁ బెను - ఱాలనుదేల్చె - న
భంగపత్రముల - విందాయణి త
రంగాంబుల భ - ద్రితఁ దేల్చిత హా! హారతి॥

ఈ సకలము సృజి - యించెడి పరసీ
జాసనుఁడును నీ - సరి తూఁగెడునే?
దాస హనుమ మ - స్తము నీపదముల
నాసక్తిని వి - న్యస్తముఁ జేసెను॥ హారతి॥

## సెజ్జ హారతి

౬

మధ్యమావతి ఆటతాళము

జయము! జయము! శ్రీ - సాయి గురుదేవ!
జయము! సత్కరుణా - మయ ప్రభావ! (ధ్రువము)

పవ్వళింపఁగదె! - బాబా సాయీ!
పువ్వుల సెజ్జ ప్రి - యా! మందిరమున
కేల హారతులఁ - గీలించుచుఁ బ్రేమ
జోలలఁబాడుచు - జోకొట్టెదము॥ జయము॥

సదయ మాత నిజ - సంతతి నట్లీవు
మృదు మధురోక్తుల - శ్రితులను మనుతువు
భక్తుల ఆధి - వ్యాధులఁ గొందువు
సక్తిని సుఖము ప్రి - సాదించెదవు॥ జయము॥

అగణిత శ్రితజన - తాపదలడఁతువు
తగ దర్శనమిడఁ - ద్వరఁ బరువిడుదువు
అలసినావు బా - బా! శ్రమపడితివి
అలరు సెజ్జఁ దను - వల్లనఁ జేర్పవె! జయము॥

క్షమయ నీదు మృదు - శయ్యాతలము
సుమనోవృత్తులె - సుమ సంచయము
స్వీయజనము లిడు - సేవా లేశము
సాయీ! సద్గురు! - సమ్మతిఁ గొనుము॥ జయము॥

పంచప్రాణములు - పంచ జ్యోతులు
కాంచని మనములు - కోమల కాంతులు
సేవక భక్తుల - సేవా ప్రేమలు
పావన! అత్తరు - పన్నీరములు॥ జయము॥

దేవా! నీ శుభ - దివ్యపదము విడి
పోవఁగ మా మన - ములు వెతనొందెడి,
ఆనతి - కాన ప్ర - సాదాశిస్సులఁ
బూని గృహములకుఁ - బోయెద మిమ్ముల॥ జయము॥

అరిగి వేకటను - దిరిగి వచ్చెదము
పొటిఁ బదరక్తి ప్రి - బోధించెదము
నిద్రలేపవలె - నిన్నతి ప్రేమ
భద్రములిడ పరి - పాలిత హానుమ! జయము॥

## సెజ్జ సేవ

౭

నీలాంబరి ఆటతాళము

శయనింపవే! బాబా! - సాయీ! అవధూతా!
శయనింపు చిన్మయ - సుఖ సంధాతా! శయనింపవే॥

సచ్చిదానంద - శయ్యను సుఖనిద్ర
బుచ్చవె! యేకాంత - ముగ సాయి భద్ర! శయనింపవే॥

వైరాగ్యమార్జనినిఁ - బరిశుద్ధిఁ గావించి
సార ప్రేమాంబులఁ - జల్లినా ప్రార్థించి
వ్యాప్తిఁగ నవవిధ - భక్తి తివాచీలు
సప్తదీపములివె - జ్ఞానతేజముఁ గ్రోలు॥ శయనింపవే॥
లలిహృది ప్రేమ డోల - లను నిల్పినాము
వెలయ సుసంకల్ప - విరులుంచినాము
ద్వైతమున్ తలుపులు - వైచి, తెర దింపితిమి
బ్రాంతిగ దుశ్చింత - బంధముల్ దునిమి॥ శయనింపవే॥
భయపడిపారిరి - వ్యామోహ వాంఛలు
దయయు క్షమయు శాంతి - దాసిరి దాసలు
సాయి! "ఉన్మనీ" యను - సాలువఁగైకొని
హాయి నిదురింపవె! - హనుమ ప్రార్థన విని॥ శయనింపవే॥

## ప్రసాద స్వీకృతి

రా

బేగడ ఆదితాళము

ప్రసాద మీఁగదవె! - బాబా సాయా! ప్రసాద॥
ప్రసాదమునకై - బాబా! వేచితి
అసామాన్య భా - గ్యము నే కోరితి
ఈవు భుజించిన - విడు పళ్ళెరముల
దేవా! శేషముఁ - దినియెద నిమ్మల॥ ప్రసాద॥
కలఁచి కలఁచి నిను - గాసిలఁజేసితి
అలయించితిఁ దుది - నైక్యము నొందితి
చిర కాంక్షలఁ దీ - ర్చితి వతిప్రేమ
స్థిరశాంతి సుధా - ర్జించెను హనుమ॥ ప్రసాద॥

## ప్రసాద స్వీకరణానంతర గేయము

౯

కాంభోజి ఆదితాళము

విశ్రమింపవే! - విఠోబ! సాయీ!
విశ్రమింపఁగదె! - వేంకుశ! సాయీ॥ విశ్రి॥

విశ్రుతమగు నీ - ప్రేమ ప్రసాదము
స్వాశ్రిత జనులకుఁ - బంచియిడితి వ
జస్రము భక్తిని - సలుపుచు నీకు మ
హాశ్రమఁ గూర్చితి - మయ్యా! యిక నేఁ॥ విశ్రి॥

సాయి! కృపాళూ! - సాయి! గోపాలా!
హాయి నిదుర బో - మ్మయ్యా! లీల
మా యాశయముల - మన్నించితిట
స్వీయ గృహములకుఁ - జేరెద మొకట॥ విశ్రి॥

ప్రభూ! మరల నిను - ప్రబోధింతుము
ప్రభాతమున మా - స్వలాభార్థము
శుభాఽశుభకృతి - ప్రసూత బంధము
విభంజింప నిను - వేడుకొందుము॥ విశ్రి॥

నీ యెంగిలి భుజి - యింపఁ బెట్టితివి
సాయీ! మము వా - త్సల్యతఁ గంటివి
నీ యభేదగతి - నిరూపించితివి
ఈయెడ హనుమ - త్కృతిఁ గైకొంటివి॥ విశ్రి॥

స్వ బో ధ

౧౦

పడదిపి ఆదితాళము

ఎఱుఁగలేమురా! బాబా మర్మం - బెంతవారలేని,
మా బాబాతత్త్వం - బెంతవారు గాని॥ ఎఱుఁగ॥

కొందఱు కపటిగఁ - గొందఱు వెఱ్ఱిగ
పాషండుఁడుఁగ - వదరిరిరా! ఎఱుఁగ॥

కొందఱు లోభిగఁ - గొందఱు భోగిగ
జ్ఞానియనుచుఁ గొం - దరు దలచిరిరా: ఎఱుఁగ॥

కొందఱు యోగిగ - కొందఱు త్యాగిగఁ
గొందఱు సాధను - కొందురురా! ఎఱుఁగ॥

కొందఱు గురుఁడు స - ద్గురుఁడని కొందఱు
కొందఱీశుఁ డను - కొందురురా! ఎఱుఁగ॥

శ్రీ సాయీప్రభు - సిద్ధస్థితి నే
కొందఱో సత్యము - గుర్తించిరిరా! ఎఱుఁగ॥

ఎవరెవ రేగతి - నెంతురో యాయా
ఫల మవ్వారికిఁ గలుగునురా! ఎఱుఁగ॥

ఇందఱ పలుకుల - నెంచి భ్రమింపక
హితమతి హనుమా! ఏగుమురా!
సత్కృతమతి హనుమా! - ఏగుమురా! ఎఱుఁగ॥

(శ్రీ) సాయీబాబా

త్రికాలసేవ సమాప్తము.

శ్రీ సాయీనాథాయనమః

# న్ సాయీ స్మరణ

౧

శ్రీ గోవింద పరావతారుఁడవు నిన్ జింతించు భక్తావళిన్
యోగక్షేమవహుండవై మనుతు, వేదో, పూర్వపుణ్యంపు సం
యోగాధిక్యతఁజేసి యేడుగడవైయున్నాఁడ వీ పుట్టునన్,
రాగద్వేష నివృత్తభక్తినిడి నన్ రక్షింపు, సాయీశ్వరా!

౨

మాయాతీతు ననన్యు నిత్యు విమలున్ బ్రహ్మణ్యు ధీసాక్షినిన్
జ్ఞేయున్ ద్వంద్వ విదూరుఁ గేవలుని సచ్చిద్రూపు శుద్ధాత్ము, నా
మ్నాయాతీత పదప్రకాశు విమలానందాను సంధాయకున్
సాయీనాథు సమర్థసద్గురు నినున్ ధ్యానింతు నశ్రాంతమున్.

౩

కన నీ శీరిడిభాగ్యమేమొ నరలోకంబం, దహా! లోకపా
వన భక్తౌఘముచేరి, యందుపనిషత్ప్రామాణ్యు గుప్తాంచితా
ర్థ నిరూఢిన్ జిదచిద్విశిష్టము పరబ్రహ్మంబు సాయీ యభి
ఖ్య నరాకారమునన్ వెలుంగఁగని నిత్యానందమున్ బొందెడిన్.

౪

అరయన్ సాయిపదాబ్జభక్తి కలితస్వాంతుండె ధన్యుండు, వాఁ
డరకాసేనియు లేనివాఁడయినఁ దా సౌగాక, లోకంబులం
దరుదౌ భక్తుని ప్రేమపాశములచే నాకర్షితుండై, వికుం
ఠ రమన్‌గాదని విష్ణువే నతని హృన్మధ్యంబునన్ నిల్చెడిన్.

౫

నినుఁ జింతించినవారి పాపచయమున్ నిర్మూలమున్‌జేతు, స
జ్జనులై నిన్గొలువన్ శుభప్రద మనస్సంకల్పముల్ గూర్తు, భీ
తిని దుఃఖంబును లేమిఁ బాపుదువు దయార్ద్రీభూత చిత్తుండవై
జనకోటిన్‌గను నీకు సాటిగలదే? సాయీ! ప్రపన్నావనా!

౬

ప్రతి జీవంబునఁజేరి చాటుపడి, సర్వవ్యాపియై యీశుఁడై
యతుల ప్రాణిచయాంతరాత్మయయి, కర్మాధ్యక్షుఁడై లోక సం
స్థిత భూతాధినివాసుఁడై, హృదయ సాక్షీభూతుఁడై నిర్గుణాం
చితుఁడై కేవలుఁడైన దేవుఁడొకఁడౌ శ్రీ సాయి వర్ధిల్లెడిన్.

౭

కనుచుండన్ జను నాయువొక్క దినమేగన్ నాశముంబొందు యౌ
వనమున్, జన్మదినంబురాదు, జగమున్ భక్షించుఁ గాలుండు, నీ
ధనముల్ బుద్బుదసన్నిభంబులు, తటిత్ప్రాయంబు జీవంబు కా
వున, నిన్నే శరణంటి నీయు మభయంబున్ నేడ సాయీప్రభూ!

౮

ఘన వైరాగ్య వివేక శీలములు నాకా లేవు; లేదయ్యె సా
ధన షట్కంబు, ముముక్షుసంపద; విశుద్ధజ్ఞాన మేరీతిఁ గ
ల్గును? సంసారమహాబ్ధితారకము నాకున్జూపి, శ్రౌతి ప్రబో
ధ నిదానంబగు బుద్ధినిమ్ము, కరుణాంతస్సార! సాయీశ్వరా!

౯

అరయఁగ నామరూప విలయంబులులేక, ప్రసాదకాంక్ష స
చ్చరణ సరోజసేవలనుసల్పు శ్రిత ప్రకరంబు నోమ, నా
దరమున నామరూపములుదాల్చి, స్వలీలలఁజాటు మేటియౌ
పరమదయాంబురాశి భగవానుఁడుసాయి, ప్రసన్నుఁడయ్యెడున్!

౧౦

యతి వర్గంబులకున్ సుపర్వుల కలభ్యంబౌదు, వీ మాపురా
కృతమౌ పుణ్య విశేష మెట్టిదియొ! శిర్డీన్నిల్చి, మమ్మోము బా
ధ్యతగైకొంటి; సతీ సుతాది బహుళంబౌ నీదు మాయాప్రక
ల్పిత మోహాంచితబంధముల్ దునుమ రావే! సాయినాథప్రభూ

౧౧

తమ్మి నెలంతసామి యవతారములెన్నియొ యుండుఁగాక, ధ
ర్మమ్మునునిల్పి, సాధుజన రక్షణ దుర్జన శిక్షఁజేసి, భ
ద్రమ్ములఁగూర్చుఁగాక, నిరతంబును నీవలె నార్తరక్షణాం
కమ్ము వహించి, ప్రాపిడెనె? కంటికిఱెప్పగ; సాయిసత్ప్రభూ!

౧౨

చీమన్ దోమ సరీసృపంబులను బక్షివ్రాతమందుణ్ మృగ
స్తోమంబందున, మానవ ప్రకరమందున్, జేతనా చేతన
గ్రామంబందున, రేపు మాపులను జాగ్రత్స్వప్నకాలంబులన్
నీ మూర్తిన్గనుబుద్ధి నాకిడవె! తండ్రీ! సాయినాథప్రభూ!

౧౩

ఈ మాయాజగమందుఁ గాననగు నా యీప్రాణిసందోహమున్
వ్యామోహంబున స్వీయ కామపరితృప్త్యర్థంబుఁగా నెంచు చు
ద్దామభ్రాంతినిఁ జూచుచుంటిఁ బరతత్త్వజ్ఞాన బోధార్థమౌ
నీ మూర్త్యంతరమౌట నేమఱితిఁ దండ్రీ! సాయినాథప్రభూ!

౧౪

ఆనందంబగునేని, నయ్యది త్రికాలాబాధ్యమై, భీతి ల
జ్జా నిర్మూలనమై నిజానుభవ సచ్ఛాస్త్రానుకూలంబునై,
ప్రాణి క్షేమకరంబునై, ప్రకటితాద్యంత్యాంత రైకంబునై
రాణింపన్వలదే యపేక్షిత సుఖార్థంబెందు? సాయీశ్వరా!

౧౫

క్షణికంబై, భయ లజ్జలన్బెనసి శాస్త్రాదేశితాచార బు
ద్ధినిరూఢిన్ వెగలై, నష్టమయి, యాదిన్ మధ్యయుం దంతిమం
బున భిన్నంబుగఁ బొల్చు లౌకికసుఖంబున్ గోరి యానందమం
చనుభూతిన్గను నా తలంపు సరిచేయన్లేవె! సాయీశ్వరా!

౧౬

ఏదేఁ గోరికచేసి జీవములు నా యీ చేతనాచేతన
హ్లాదంబుఁ బ్రకటించి ప్రేమ యదియున్నట్టుల్ ప్రదర్శింపవే?
యాదార్థ్యంబగు ప్రేమపాత్రమవు నీవౌ, దింక, వెఱొండెడఁ
లేదంచుఁ గనుగొంటి స్వానుభవపాళిఁజేసి, సాయీశ్వరా!

౧౭

"నే నీవాఁడనటంచు నొక్కపరి నేనిఁ బల్క నాపన్నుఁడౌ
వానిఁ గూరిమిఁబ్రోతు నియ్యది వ్రతంబౌ" నంచు మున్నాడవే?
యీ నిర్భాగ్యునిఁగావఁ జేయినిడఁబోవే? పల్కలేవే? మనం
బేనిఁగల్గదె? లేశమేఁ గరుణరాదే? సాయి! బాబా! ప్రభూ!

౧౮

ఎందఱ యార్తిబాధ శమియింపఁగఁ జేసితి, కష్టవార్ధిలో
నెందఱుగూలఁ గాచితివి, యెందఱచర్యలు చక్కఁజేసి తీ
వందఱఁబ్రోతునంచుఁ బలుకాడవె? నన్వెలిసేయుదేమి? యే
మందును? నీయనుగ్రహమ యౌననుకొందును; సాయిసత్ప్రభూ!

౧౯

ధన ధాన్యంబుల, భూషణాంబరములఁ, దారాసుతాప్తాళి, భో
గ నికాయంబుల నిన్నుగోరు టల యోగ్యంబౌను; నిన్జేరువా
రిని రక్షింపఁగ దీక్షబూనితివి; వేరే కోరనేలా? సుబు
ద్ధిని, సద్భక్తినొసంగలేవె? కరుణాబ్ధీ! సాయినాథప్రభూ!

౨౦

నిలువద, యిట్టులాడియును నిత్యమదొక్క యుగంబుగాఁగ నా
తలఁపునఁబుట్టు నెన్ని భయదంబగుకోర్కెలు; కాతువంచు లోఁ
దెలిసియు, నిశ్చలంబగుమతిఁ నినుఁగొల్చుచునుండలేక, చా
పలతఘటించు నన్ను సయిపంగదె కూరిమి; సాయిసత్ప్రభూ!

౨౧

కల వెన్నెనియు నార్త భక్తజన రక్షాదక్ష దీక్షోత్తమం
గల్లముల్ శ్రీ పరమేశరూపములు లక్షల్, గాని నాయట్టి పా
పులు వానిఁ దఱిఁజేర జంకుదురు, నీవో, సర్వ సౌలభ్య మం
గల రూపుండవటం చెఱింగితిని రంగా! సాయినాథప్రభూ!

౨౨

స్వాంతమునన్ దహంకృతికి స్థానము గల్గగనీకుమయ్యా! దు
శ్చింతల మానిపించి సమచిత్తము నెల్లెడఁ గల్గఁజేసి, శ్రీ
మంతులఁ మ్రొక్కు దైన్యమును మానిపి, నీ పదపంకజ పంజరా
భ్యంతరమందు నా హృదయహంసిని నిల్పుము; సాయిసత్ప్రభూ!

౨౩

గ్రహ శుభయోగదృక్కులును గాల విధానములేల? యీ దురా
గ్రహులగు మిత్ర బాంధవనికాయము పంక్తులఁ జేరనేల? ని
గ్రహ రహ మర్థలబ్ధికిఁ బ్రియాసలు పొందగనేల? నీ యను
గ్రహమది యున్న నింకఁ గడుగాసిలనేపని? సాయిసత్ప్రభూ!

౨౪

వలదీపద్ధతి, చేయుమీపని, జయప్రాప్తిన్ గనన్ జాలు దీ
వల నన్ బొమ్మని చెప్పఁగాఁ దగదె దేవా! వ్యర్థమౌ నాశలన్
గలిగింపన్ బనియేమి? వానికయి ప్రాకన్ జేయఁగానేల? యీ
వల నేడ్పింపఁగనేల? నన్నిలవనీవా? సాయినాథప్రభూ!

౨౫

సాయీ! నా యపరాధముల్ సయిచి నా స్వాంతంబుఁ జక్కంబడన్
జేయంజాలుదటంచు నెంచెదను; దుశ్చింతల్ దొలంగింపుమీ
మాయం ద్రోయకు, నీ పదాబ్జములు సంభావింపఁగానిమ్ము, దే
వా! యీ నీదుపరీక్షకున్ నిలువ నాకౌనే? దయాంభోనిధీ!

౨౬

మిత్రద్రోహము నేఁ ఘటించుఁగల కూర్మిన్ బేర్మిఁగారించు, స
త్పాత్రాపాత్ర వివేకముఁ జెఱచు, దుర్వ్యామోహమున్ గూర్చుఁ జా
రిత్రంబున్ మలినంబొనర్చుఁ బెడదారిన్ద్రిప్పి నొవ్వించుఁగా
నేత్రం బెంతటికల్మషేంద్రియమొ తండ్రీ! సాయినాథప్రభూ!

౨౭

బాబా! నీ కరుణామృతాంబునిధికిన్ బారంబులేదయ్యా! నా
యీబాధల్ వెడఁబాపనేరికగు? నీవేచిక్కవే నెప్పుడో
యే బావో చెరువో యేదో కనక నే నిన్నాళ్ళు జీవింతునే?
నీ బిడ్డల్ చెదరంచుఁ జాలెదను తండ్రీ! సాయినాథప్రభూ!

౨౮

పరిపక్వస్థితిలేద యీమతికి, దుర్వాంఛా పరిగ్రస్తమై
యెఱుకన్ గాంచదు; గ్రంథముల్ చదివెఁగా కేమయ్యె నవ్వానిచేఁ
దరుణీ విత్తచయాది సంసరణబంధశ్రేణికిన్ జిక్కి వా
సరముల్ పుచ్చఁగనీక ప్రోవఁగదవే! సాయీ! ప్రపన్నావనా!

౨౯

నినుఁ దొలిపుట్టునఁ దఱియనేఁ గననేర్తునె నీదుపాద చిం
తనమును? నల్వదేండ్లు పయినఁబడు నావల స్వప్నమందు నే
పనికినిపంప? నీ కృతులఁ బల్కుమటంచు వచింతువేమి? మి
త్రుని వెసఁబంపి నీపదరతుఁ బొనరింతువదేమి? సద్గురూ!

30

ఏ తపముల్ పొనర్చితినొ యేమొ యెఱుంగమగాని తొల్లి, సం
జాతముగల్గె భక్తులగు సాధుకులంబునఁ; దల్లిదండ్రులుఁ
దాతలు బంధుమిత్రులు సుదారులు; బాల్యమునుండిభక్తి యే
దో తగఁ జిత్తమందొదిగియుండెను నీకృప; సాయి సద్గురూ!

౩౦

జననంబందినకాలపుం దొసఁగొ, మ్లేచ్ఛ స్తన్యపానంబొ, దు
ర్జన సంపర్గఫలంబొ, కానియెడఁ బ్రారబ్ధంబొ, యేమో! పొసం
గెను దుర్బుద్ధులుఁగూడఁ; దత్ఫలముగల్గెన్; స్రుక్కు ప్రాణావశి
ష్టుని నన్గాంచి కృపన్గ్రహించితివి యెట్టో; సాయినాథప్రభూ!

౩౧

ఏకాలంబుననేని నేవిధిని నే యేమాత్ర భక్తాళికిన్
జేకూర్పందగు నీ వెఱుంగుదువు; నిన్ జేపట్టునాటన్బలెన్,
నీ కారుణ్యవిలాస మేమనుచు వర్ణింపంగనౌ! నద్భుతా
నేకంబుల్ ఘటియించి సాకుదువు; తండ్రీ! సాయినాథప్రభూ!

౩౨

'తిండికిలేదు'-బాబ! యన దెత్తువు బియ్యము నెత్తిమోయుచున్
గొండొక పైసలేదనినఁ గొమ్మని యిప్పుయిసన్ ఘటింతు, నా
యండను నిల్చి యార్తిని భయంబును బాపుదు నీవె నాకు లే
కుండిన నేటి కేమగుదునోగద? దిక్కటఁ; సాయి సద్గురూ!

౩౪

బాబా! నీవొనరింప బూనినపనిన్ భంగంబు వాటిల్లునే
కాఁబోదన్న విచారమేమియును నాకా లేదు; నన్నేమఁగా
నేబాటన్ నడిపింతొ యట్లు నడుతున్ హేయాపమానంబు లే
లా? బాగోగులెఱుంగ నే నెవఁడ! దేవా! సాయినాథప్రభూ!

౩౫

బాబా! యంచన 'నో' యటందువఁట; "దేవా! ద్వారకామాయిసా
యీబాబా! కరుణింపవే!" యనినఁ జేయిన్జాచి నీ భక్తు "రా
రాబాబూ!" యని చేరఁదీయుదట యార్తత్రాణపారీణతన్,
నీ బిడ్డన్ నను నేమభారమయె? తండ్రీ! సాయినాథప్రభూ!

౩౬

'అల్లా' తోడ ప్రసంగమగ్నుఁడగునే! యాత్మీయు లేరేని వా
కిళ్ళన్ నిల్పిరొ? యార్తుఁడౌ శ్రితునకున్ గేలీయ వేంచేసెనో?
యెల్లంబిల్చినఁ బల్కఁ, డీవయిన నా యాకూయి విన్పింపవే!
తల్లీ! ద్వారకమాయి! నీకు దయరాదా? సాయికై వచ్చితిన్.

౩౭

ఐహిక దుఃఖగర్భిత సుఖానుభవంబులు సన్నగిల్లె, నీ
దేహపటుత్వ సత్వములతెన్నదితప్పె, ననుక్షణంబు సం
దేహముఁదోఁచె జీవముగతిన్ దినమొక్కటియేగ, నింక, దు
ర్మోహమడంచి కర్మ పరిపూర్ణముసేయవె! సాయిసద్గురూ!

౩౮

కానన్ లేక, యనిత్యరూపమగు నీ కాంతా సుతాప్తార్థ భో
గానందంబుల నమ్మి, ప్రేమ బలుపంగాఁజూచు నీవాని, సుం
తైనన్ లెక్కిడువారలుందురె? పరార్థప్రేమ యెందున్న ద
న్నా! నీయొక్కనియందుఁదక్క; బుధమాన్యా! సాయినాథప్రభూ!

౩౯

కోఁతిన్ బోలిన చేత మెల్లెడల లాగున్; నీతి నీమంబులన్
ఖ్యాతిన్జూడగ నీదు, దుష్కృతులపై నాసక్తిఁగల్పించు, నా
హా! తార్మారగుచుండె బుద్ధి; మలినంబౌ నిట్టి చిత్తభ్రమన్
బ్రాంతిన్ బో నడపంగఁజాలవొకొ? దేవా! సాయినాథప్రభూ!

౪౦

ప్రీతిన్ నీదరిఁజేరువారలను నీవే చక్కదిద్దన్దగున్
లాఁతుల్ మాడ్కిఁ బరీక్షసేయుటది యేలా? నీచసాంగత్య మీ
వే తూలించి, హరించవే యఘము; వేరే దారికన్పింపదే,
స్వాతంత్ర్యంబది లేదు నీశ్రితులకప్పా! సాయినాథప్రభూ!

౪౧

తొలిజన్మంబున షీర్డియందు ద్విజ జంతుస్థాణు పృథ్వీజ గు
ల్మ లతానేకములం దొకండనయి ప్రేమం నీవౌ నీభక్తులో
మెలఁగం దత్పదరేణుసంగతిని నీ మేనొందితిం నీపదం
బుల ప్రాపొందఁగ నోము నోచితిని, బాబూ! సాయినాథప్రభూ!

౪౨

సాయీ! యన్నను, సాయినాథ యనినం సాయీశ్వరా! యన్న, శ్రీ
సాయీశంకర! సాయిదత్త! యనినం సాయీగురూ! యన్న శ్రీ
సాయీరాఘవ! సాయికృష్ణ! షిరిడీశా! యంచనం, ద్వారకా
మాయీమందిర! సాయిబాబ! యనఁ బ్రేమం భక్తులం బ్రోవవే?

౪౩

అమ్మకచెల్లి! నీదగు దయారస మేమనిచెప్పవచ్చు? జి
త్తమ్మున నిన్దలంచెడి శ్రితప్రకరంబుల కెప్పుడెట్లు సా
యమ్మొనరింపఁగా నగునొ యట్లుఘటింతు; విచిత్రరీతి, ని
న్నమ్మినవార లెన్నఁటికి నాశమొకుంగరు; సాయిసద్గురూ!

౪౪

'యోగము' 'యోగమం' చన ధనోన్నతిచే నదియోగమౌనె? దు
ర్యోగముగాక; నీదు పదయుగ్మముసం దనయంబు భక్తి సం
యోగమునొంది చిత్తము మహోన్నతశాంతినిఁ గాంచుటొక్కటే
'యోగము' 'రాజయోగ' మన నొప్పు జగంబుల, సాయిసద్గురూ!

౪౫

శాస్త్రీయంబగు కర్మముల్ సలుపఁగా సామర్థ్యమా లేదిఁకం
నిస్త్రైగుణ్య పథంబునం మెలఁగ జ్ఞానిం గాను, సద్భక్తినేం
శాస్త్రప్రోక్తముగా నొనర్తునన నేజాల్మందు; నీనామ స
న్నిస్త్రింశంబునఁ బాశముల్ దులుతుఁ దంద్రీ! సాయినాథప్రభూ!

౮౭
సతియుఁ బిడ్డలురోయనీ, తుదకు నా సంబంధులుఁ దూఱనీ,
మతికిఁ దుర్భరమౌచు జీవితము వమ్మైపోవనీ, మిత్రసం
తతియుఁ హేళనసేయనీ, విడువ నుంతఁ నీదు పాదాంబుజా
మృత పానోద్ధతచిత్త షట్పదతఁ; దండ్రీ! సాయినాథప్రభూ!
౮౮
చెప్పఁగ నేమియోతలఁతుఁ జెప్పఁదొడంగినమాటరాద; నే
నెప్పుడు నార్తికంపువ్యథలే వచియించుట నీవు వింటయుఁ
దప్పనివయ్యె; నా మతికి దారిమఱొండుకనంగరాద; యీ
ముప్పు నిఁకెట్లుగాచెదవొ? మ్రొక్కెద వేమరు; సాయిసద్గురూ!
౮౯
తల్లినిఁ గొంగువట్టి తమదావునకీడ్చుచు బిట్టునేడ్చు నా
పిల్లల కాటవస్తువులెవొ పెట్టుచుఁ గన్మఱఁగించుపోల్కి, నీ
కాళ్ళనుబట్టినా వివిధకష్టములఁ వెలిఁబుచ్చుచున్న నా
కళ్ళనెటో భ్రమించి, యెఱుకఁ మఱపింతువె? సాయిసద్గురూ!
౯౦
నీ నిందఁ బొనరించు నాస్తికులతో స్నేహంబు మాన్పింపవే,
నీ నామంబును బ్రీతిమై నెపుడుధ్యానింపఁ మతిఁగూర్పవే,
నానాభూతములఁ ద్వదాకృతినిఁ గానఁజేయవే, నీదు సే
వానిష్ఠఁ ఘటియింపఁగాఁగదవె! బాబా! సాయి! షిర్డీశ్వరా!
౯౧
ఏ నేకార్యముఁ జేయుచుండిననుగాని నీదునామామృతం
బానంగాఁగల భాగ్యమీయఁగదవే! యాగామి ప్రారబ్ధముల్
నానాసంచిత కర్మముల్ దులుతు దానఁజేసి; త్వద్విస్మృతిన్
గ్లానిన్ గూర్పవె! యార్త భక్తజనపాలా! సాయినాథప్రభూ!

౫౧

నీ మాయా పరికల్పితంబిదియ తండ్రీ! కామినీవిత్త దు
ర్వ్యామోహంబునఁజిక్కి స్రుక్కితిఁ గృపాపారీణ చిత్తంబునన్
క్షేమంబైన పథంబుఁజూపి, కడు గాసిన్జెందు నన్బ్రోమవే!
చేమోడ్పుల్ ఘటియింతు; శాంతినిడవే! షిర్డీశ! సాయిప్రభూ!

౫౨

నిత్యము నే ధనార్థినయి నిన్ భజియించుట నాకె సిగ్గగున్
సత్యముఁ బల్కుచుంటి, శ్రిత సంచయకల్పకుజంబవీవు నిన్
బ్రత్యహమున్ ముముక్షునయి ప్రార్థనసేసెడిభాగ్యమిమ్ము, నీ
వత్యనుకంప నెందఱకు నాశ్రయమీయవు? సాయిసద్గురూ!

౫౩

నీ దిక్కేగన నోచఁబోవని మహా నిర్భాగ్యులౌ వారికే
యే దిక్కున్నఁ బ్రయోజనంబుగలదే యిందేని నందేనియున్?
నీ దిక్కే నెఱనమ్మితిన్ బెఱ నేదేనిన్ గోర ముమ్మాటికిన్;
నా దిక్కై యవలంబనంబిడవె! యన్నా! సాయిబాబా! ప్రభూ!

౫౪

నీ పదకంజ పంజర వినిర్మల దివ్య మరందపాన సం
ప్రాపిత శాంతిఁగూర్చి మతి బంభరమున్ శయనింపనీయకే
రూపునుమాపుఁ గాపురపురొంపినిదింపి కలంపనేటికో?
కోపవుపంకమందిటుఁ దగుల్పఁగనేటికి? సాయి సత్ప్రభూ!

౫౫

నా బుద్ధిన్ వశియించి యెట్లు చనుమన్నన్ మారుమాటాడకే
యా బాటన్ జనుచుండ, నాదగు శరణ్యంబీవ; ముమ్మాటికిన్,
నా బాగోగులకీవ; నాకిఁక స్వతంత్రంబించు నొండున్నదే?
బాబా! ద్వారకమాయిమందిర! శ్రితాపత్త్రాణ! సాయీశ్వరా!

౫౬

ఋణముల్ కష్టములేమి లేనియెడ నాకీ నీదుపాదాబ్జ పా
వనసేవా మహనీయభాగ్యమది సంప్రాప్తించునే? యేదొ కా
రణమున్ గూరిచి నీదుసన్నిధికిఁ జేరన్ జీరుదీజీవి, న
ట్లని వాక్రువ్వవె? దేవ! యార్తజనకల్పా! సాయినాథప్రభూ!

౫౭

ధన ధాన్యంబుల భోగ భాగ్యముల నేదారిన్ బ్రసాదించినన్,
నిను, నీ నామము, నీ పదార్చనము, నీ నిష్ఠాప్తి నీ సూక్తు లే
క్షణమందున్ మఱపింపఁజేయకుమ, యీజన్మంబునం దింక నే
జననంబందు; శ్రితావనామరమహీజా! సాయినాథప్రభూ!

౫౮

“సత్యంబైన పథంబువీడక చరించన్ నేర్చి, వాగ్దత్తముల్
ప్రత్యంశంబును దీర్చుచున్, సహన విశ్వాసంబులన్ గాంచుచో,
నత్యంతాదృతి నోముచున్ విడక నీయందుండి చేయూత నే
నిత్యంబిత్తును నమ్ము” మం చనవె? తండ్రీ! సాయినాథప్రభూ!

౫౯

“ఏ భీతిన్ గననేల నేయెడల? నే నెవ్వేళఁ బ్రాపుండఁగా,
నీ భారంబులనిల్పు నాపయిని నే నే నిర్వహింతున్ సదా;
యీ భూతావళి నెగ్గొనర్పఁ గలదేదేన్ లేదు విశ్వంబునన్
నా భక్తుండగువాని” కం చనవె? మాన్యా! సాయినాథప్రభూ!

౬౦

గురుఁ డెందేనియు “రమ్ము నాదఱికి నాకున్ మ్రొక్కు, మీదక్షిణల్,
పరిచర్యల్,సమకూర్చుమీ”యనుచుఁ బిల్వన్ బోఁడుశిష్యుండొగిన్
పరమస్థానముఁగోరి భక్తి దృఢ విశ్వాసంబులన్, దాన, స
ద్గురునిం జేరి భజించు” నంచనవె? బంధూ! సాయినాథప్రభూ!

౬౧

ఏ సంస్థానము మీది? షిరిడిసఖా! యెవ్వారలో మీప్రభుల్?
శ్రీ సాయీప్రభువుల్; వదాన్యుల? హితశ్రీ దాత; లేమిత్తురో?
వాసోగ్రాసములన్ సతీసుత నిజాప్తశ్రేణికైయిత్తు; రే
మా సౌజన్య? మదెల్ల- స్వానుభవవేద్యం బాద్యమున్ హృద్యమౌ.

౬౨

"కలహంబాడకు మేరితోనయిన ధిక్కారం బహంకారపుం
బలుకుల్ పల్కకు, మీనుబోధఁ గమనింపన్ జాలవేన్, లోన నా
కులపాటున్ విసుగున్వహింతు, నదినీకున్మేలుగా" దంచు మున్
బలుకన్లేదె? శ్రితాపనాభ్యుదయ! బాబా! సాయి! ప్రేమాలయా!

౬౩

"సతమున్ సాధులఁజేరి వందనసమర్చా సేవలన్సల్పి జీ
వితమున్ నైతికనిష్ఠమైఁ గెడపెదేన్ విశ్వంబునన్ శుద్ధతన్
మృతివేళన్గను, దీవ కాముకుడవై యిష్టేశు లో నిల్పి వం
చితఁగాంచంగ విముక్తియౌ" ననవె? యీశా! సాయినాథప్రభూ!

౬౪

ఐహిక భోగలంపటులునై ధనధాన్య సతీ సుతాప్త సం
దోహము సేకరింపఁగ జనుల్ నిరతంబును గాంక్షసేయు స
ట్లీహ, భవత్పదంబుల వహింపఁగఁజేయుము; కర్మబంధ దు
ర్మోహ లతాలవిత్ర! గురుపుంగవ! సాయి! భవాంబుధి ప్లవా!

౬౫

పెట్టినమాత్రగాక యొక వీసమునే నధికంబురా దిటుల్
గట్టిగ శాస్త్రముల్వలుకుఁ గాదనఁబోవఁడు, గాని, యాశ్రయం
బెట్టుల వ్యర్థమయ్యెడిని? హీనునివేడి గడించుకంటె నీ
యట్టిడిఁగోరి రిక్తకరుఁడైచన మేల్గద? సాయి సత్ప్రభూ!

౬౬

తగదంచున్ దగకేమి యంచనెడు ద్వైధాభావముల్ పోరి కా
ర్యగతిన్ దోఁపఁగనీయకే కలఁచి ధైర్యంబెల్లఁ బోకార్చు; మే
లగుదానిన్గొని కీడుఁ ద్రోయఁగల నేర్పు లేదు; నీవీడ్చు నా
పగిదిన్ బోవలె, నస్వతంత్రుఁడను; దేవా! సాయినాథప్రభూ!

౬౭

కలుముల్ గూర్పఁదలంతువే నొరలు నిన్గాదందురా? లేక లే
ములఁగుందింతువయేని, నెవ్వరయినన్ బోఁద్రోయువారున్నె? నిన్
బలుమార్గంబులవేడి వేడి, తుదకున్ బ్రాణాలపై నాసలున్
దలంగన్బెట్టఁగనుంటి, నేమనుదనంతా! సాయినాథా! ప్రభూ!

౬౮

అకటా! నీపదమందు నొక్కతటి, నా యా నీచకర్మంబులం
దొకటన్ జిత్తము సంచరించెడి నిదేమో! పాపియై నీదు నెం
తకు రాఁ జంకెడు వీఁడు; వీనికిఁకఁ జిత్తస్థైర్యమున్గూర్చి, ది
వ్య కరాలంబన మీయఁగాఁగదవె; దేవా! సాయినాథప్రభూ!

౬౯

నీ సంకల్పము లేకయే పాసఁగనౌనే మంచియేన్ జెట్టయే
నాసల్ పూనుట వ్యర్థమౌ; నెటులనైనన్ వీని నీద్వంగదో
యీ! సర్వంబును నీవ కాఁదలఁచి, వేరే చింతలన్బాసి, నీ
దౌ సేవన్ దినముల్ గ్రసింపనిడుమయ్యా! సాయినాథప్రభూ!

౭౦

తుచ్ఛమ్ములన్ సుఖంబులని తోషమునన్ బరువెత్తి చిత్త మా
పచ్ఛత బాధితంబయి దివా నిశముల్ దపియించె, వీని జీ
వచ్ఛవమట్లుఁ జేసి తలవంపులుగూరిచె, నింతనేని నీ
స్వచ్ఛ పదాంబుజాశయము శాంతినిడంగదె! సాయి సద్గురూ!

౭౧

కొందలమందె డెందము, నగోచరమై చనె ముందుమార్గ, మె
త్తం దల నిల్వఁబోవదు, పదంబులు తొట్రిలు, కేలు కంపమున్
బొందెడి, బుద్ధిమాంద్యమగుఁ, బుట్టువురోయుచునున్నవాఁడ, నిం
కెందనుకన్ బరీక్షకిటులే నిలువన్వలె? సాయిసద్గురూ!

౭౨

మానమె పోయెనేనిఁ గొఱమాలినదేగద! వీనిపుట్టు వీ
ప్రాణము నిల్వనేమి? చనఁబాఱిన నేమి? తలెత్తవచ్చునే?
వేనకువేలు నీ శ్రితుల వీడక ప్రోవవె? వీనినింకఁ గా
లూని నిలంబడన్ సలుపనోడుదె? వీడవె? సాయిసద్గురూ!

౭౩

ఎప్పటికేమి కావలెనొ యీ వెటులో సమకూర్చుచుండు, వీ
త్రిప్పలుగూర్పనేల? యెదొ తెన్నుఘటించి విపత్పయోంబుధిన్
దెప్పవయై, దరిన్ గెడపి తేర్పవ? యీ తలవంపు జీవితం
బెప్పుడొ దుస్సహంబగుట, నేపని నిల్వఁగ? సాయిసద్గురూ!

౭౪

ఏ లోటున్ గలిగింపనీక యెపుడీవే? చోద్యమౌ పెక్కు చం
దాలన్ నీ చరణాంబుజాశ్రితుల యందున్నిల్చి రక్షింతు; వీ
వే లేకుండిన నిట్టి నీచునకు వేరే నిల్వఁజోటున్నదే?
నీ లీలా చతురత్వమేమనుదుఁ! దండ్రీ! సాయినాథప్రభూ!

౭౫

స్వామీ! నన్నెడదారికీడ్చెదవు నా ప్రారబ్ధమా? కాదయేన్
బ్రేమంబించుకలేద నాపయిని? గర్వించున్ ఖలుండంచు నా
బాముల్ వాపుతలంపు లోఁ గనవ? నీవాఁడన్ నినున్ జేరితిన్
నా మేలెయె విధింపుమీవ, గురుస్వామీ! సాయినాథప్రభూ!

౭౬

"శరణంచుఁ నను(జేరెనేని( గలుషాచారుండె యౌ(గాక, స
త్వరమే రక్షనొసంగు" దంచు వచియింపఁబోవె! యీ జీవి కు
ర్వర హైన్యస్థితి(బాపి, నిత్య పరితృప్తస్వాంతు(గావించి, నీ
పరమస్థానము(జేర్చు భారమువహింపఁరావె! సాయీశ్వరా!

౭౭

ఎవ్వరితోడ(జెప్పుకొన? నెవ్వరు నాదగు బాధ(దీర్చు వా
రెవ్వరినాశ్రయింప( గరుణింతురు? ప్రాణము దుల్లనున్నచో
నొవ్వను; మాన హానికెటు నొవ్వకయుండ(గవచ్చు? నింక నఁ
నవ్వులపాలుసేయక కనంగదె! సత్కృప, సాయిసత్ప్రభూ!

౭౮

అకటా! విద్యలనేర్వ నేమిట? వృథాయాసంబ, గొంతెమ్మ కో
రికలఁగోరితి, నవ్వుపాలయితి, దారిద్ర్యాంగనా ప్రేమపా
త్రకు నా లక్ష్మి వరించునెట్లు? పరనిందఁ సార్థకంబేమి! పా
మ్మిక నేమైనను గొంగువట్టితిని; సామీ! సాయినాథప్రభూ!

౭౯

వారిఁవీరిని( దూలనాడ(దగవా? భాగ్యంబురానున్న నె
వ్వారే నడ్డ(గలారె? కర్మముల(ద్రోవఁ శక్యమే యేరికేఁ?
ప్రారబ్ధం బనుభావ్య మౌనుగద! యేడ్వఁ దప్పునే? యెట్టు లే
దారిఁదిప్పెదొ యట్టులేగెద, మహాత్మా! సాయినాథప్రభూ!

౮౦

తొలిజన్మంబున నీ యనుగ్రహ మదేదోరీతి నార్జింపనేఁ
గలదే నీ పదకంజభక్తి( గనుభాగ్యం బీ భవంబందు, మున్
గల, నన్జేర(గ( బిల్వగా(గలవె? నీ కబ్బాలు వల్కింతువే?
నిలువంబెట్టుదె యింతకాలమును? దండ్రీ! సాయినాథప్రభూ!

౮౧

"గురుడీతండుసమర్థుఁడాశ్రయమొసంగున్బొమ్ము పో" మ్మంచునె
న్నెవ్వరుఁ బోఁద్రోయరు; పూర్వపుణ్య పరిపక్వంబైన సద్భక్తి నె
త్తఱినేనిన్ భవతాపతప్తుఁడై, పరిశాంతక్షేమ సౌలభ్య సు
స్థిర సౌఖ్యప్రద దక్షు నిన్, దఱియుఁగాదే? సాయినాథప్రభూ!

౮౨

ఇది సత్యంబ, యనిత్యమియ్యదియ; మేలీచొప్పు కీడిద్ది; సౌ
ఖ్యదమిద్దా నిది కష్టదంబని, యెఱుంగంగాఁ బ్రమాణాంతరం
బెదియో కోరఁగనేల? చిత్తమెట హాయింబెంది శాంతించు న
య్యదియే సంశ్రయణీయమౌపదము గాదా? సాయినాథప్రభూ!

౮౩

అడుకుల్ గుప్పెడిడన్ గుచేలునకు సర్వైశ్వర్యముల్ గూర్చి కృ
ష్ణుఁడపో యాతఁడనంగఁజేసి, జగమందున్ నీవు నీభక్తుఁ డై
త్లెడ నేకంబనుసూక్తిఁ దెల్పుటకుఁగాదే భిక్షురీతిన్ గుచే
లుఁడవై శిరిడిఁ దోచినాఁడవు, దయాళూ! కృష్ణ! సాయీప్రభూ!

౮౪

ఇటుకన్దాపిన పుట్టమే ముకుటమయ్యెన్, కుప్పి దువ్వల్వ, చెం
గట దండం బసి శంఖచక్రగద లౌఁగా: ద్వారకామాయియే
పటు వైకుంఠమ, వెల్గు నా ధునియె శశ్వల్లక్ష్మి; ఊపీఠ మొ
క్కట శేషుండయివెల్గు శ్రీహరివి, రంగా! సాయినాథప్రభూ!

౮౫

కని యుప్పొంగిన తల్లియా చనియె, బల్ కష్టంబులన్సైచి యో
మిన పూజ్యుండగు తండ్రియున్గడచె, నామేల్గోరు చుట్టాలఁ బె
ద్దనువారేగిరి, తక్కొరుల్ చిఱుత, తేమౌ నాకు? చిత్తోపశాం
తినిఁగూర్పన్ దుదకీవ నా గతివి; తండ్రీ! సాయినాథప్రభూ!

౮౬

దుష్కార్యంబు ఘటించువారలకు నిందున్ యుక్తమౌరీతి నా
యుష్కామంబులడంతు; వైన, శ్రితులైయున్నట్టి నీవారి కా
దుష్కర్మంపు ఫలంబు స్వల్పముగఁ దోడ్తోఁగూర్చి రక్షింతు; నీ
నిష్కాపట్యము సర్వ వేద్యమగు దండ్రీ! సాయినాథప్రభూ!

౮౭

నా యీహృత్కలితవ్యథల్ దిన దినానన్ జెప్పుకొంటల్ కటా!
హేయంబై కనుపట్టు నాకె, యిఁక నీవెట్లెంతొ? నీవారి ప్రా
పై, యోగంబును క్షేమమున్ బఱుపలేవా? యేల కోరాడఁగా
నీ యిష్టంబెదొ దానిఁజేయఁగదె! తండ్రీ! సాయినాథప్రభూ!

౮౮

ఈ యాశాలతికల్ నిరాశ్రయములై యెందెందొ డిందెన్; మృత
ప్రాయుండయ్యె, సతీ సుతాప్త హిత సంబంధు ప్రతానం బిదే
మి! యేవన్గనె; నిట్టు లిందునుపమేతే? భావ్యమే? ద్వారకా
మాయీవాస! సమర్థసద్గురు! కృపన్మన్నింపు; సాయీశ్వరా!

౮౯

చెడె దేహంబు, మనంబునుంజెడె, జెడెన్ శ్రీ సంపదల్, తొంటి వం
గడపుంగౌరవమూ చెడెన్, జెడెను ప్రజ్ఞాలబ్ధి, వేయేల మున్
జెడుగున్ జేరుట; నీదు ప్రాపిప్పుడు తేర్చెన్; సర్వ మట్లౌట, నన్
జెడమార్గంబునఁ బోవనీయకు దయాబ్ధీ! సాయినాథప్రభూ!

౯౦

నిను నా యేడుగడంచు నమ్మితిని హానిన్బాపి మేల్గూర్చి మె
ల్పునఁగాపాడితి ద్వాదశాబ్దములుఁ బ్రాపున్ గాపునై, నేటి నా
మనవిన్దీర్పవ? చూడవా యిటు? ద్రవింపంబోవదా యేమి నీ
మనసాక్రింత? శ్రితార్త భక్తజనతా మందార! సాయీశ్వరా!

౯౧

పుడమిన్ దీనులకెల్ల నేఁడుగడవై పోషించు నిన్నేరున
ప్పుడ నీయంతటివానిఁజేతుగద! నీవో భక్తసంరక్షణం
బిడ నీ బంటుని బంటువౌదు; వటుఁగావేన్ భిక్షువై యిట్లు శీ
రిడినిన్ దోపఁగ నేమిహేతువిఁక? తండ్రీ! సాయినాథప్రభూ!

౯౨

నా దైవంబును నాదు శాస్త్రము ప్రమాణం, బింక నన్యంబెదేన్
గాదం చుద్ధతిమై స్వపక్ష పర పక్ష భ్రాంతచిత్తంబులన్
భేదాధ్వంబున సోలి స్రుక్కఁగ నిటన్ వేదున్నవే? యిట్టి దు
ర్వాదశ్రేణికిఁ బాలుసేయకుము బాబా! సాయినాథప్రభూ!

౯౩

నేటికి వత్సరంబు లవినిండె నొకేబదినాలు గిట్టె యీ
పూటకుఁ దిండి గుడ్డలకు మోమును వాయఁగనీక నిత్తు; వీ
పాటిలు వ్యాధులాధులను బాపి మనస్థిమితత్వమీయు నే
నాటికి నీ యనుగ్రహము నాయెడఁగల్గునొ? సాయిసద్గురూ!

౯౪

గృహబాధల్ ఋణబాధ లార్థికపు దారిద్ర్యంపుబాధల్ సుదు
స్సహమై వేచెడి, ధైర్యమూడి, నిను నాస్వాంతంబునన్ నమ్మి, యను
గ్రహులౌ నిందఱమధ్యనిల్చుటకు సంకల్పించితిన్, నీ యను
గ్రహ మేనాటికిఁబొల్చు వీనిపయి? రంగా! సాయినాథప్రభూ!

౯౫

అనుపమ పూర్వపుణ్య సుకృతాతిశయాప్తము నీదుప్రాపు నే
మని వచియించువాఁడ? గలవా పదముల్ విశదీకరింప? నొ
క్క నిముసమేని నేమఱకఁ గాతువుగాదె! భవత్ప్రసాద జీ
వనులకు గల్గునే పరిభవంబు భయంబును? సాయిసత్ప్రభూ!

౯౬

ఈ బామందునఁ దొంటి పుట్టువుల నే యే పాపకర్మాళి, సా
దౌబుగఁగా విడనాడి చేయనెటు? నాయాపాపకర్మంబు లెం
తే బా[illegible]చెదు వేవిధంబులుగ; నీవే చిత్తశాంతిన్ గృపన్;
నీ బిడ్డల్. చెడరంచు నమ్మితినిఁ దండ్రీ! సాయినాథప్రభూ!

౯౭

అనుపంబై పెనుపొందు కష్టముల దైన్యం బిందురేకెత్త "నె
వ్వనిఁ జేరందగు? నేని వేడనగు? నా ప్రాపెవ్వఁడా? యే తెఱం
గున నెచ్చోటులనుండి సాయమదినాకున్ గల్గునా?" యంచుఁ గిం
దునుమీఁదున్ గనుచుంటి, నిన్ గనక; బంధూ! సాయినాథప్రభూ!

౯౮

'చందావర్కరు' భక్తిమైఁ బొనరుపన్ సంవాహన ప్రక్రియల్
సందేహంబులు వాపుచుంటివ? 'మహల్సా శ్యాములం' జేర్చి చెం
తం దీర్ఘంబుగ ముచ్చటాడెదవ? 'రాధాబాయి' పేణీల త్రి
ప్పందుంటే? యెటు? దీను నన్ మఱచినావా? సాయినాథప్రభూ!

౯౯

హృది మాలిన్యముఁ ద్రోయనేరక జనుం డేరీతి నిన్జేరు? నీ
పద సాన్నిధ్యముఁ జేరఁ డేనెటులఁ ద్రోవంజాలు హృత్కల్మషం?
బదియే చెల్లు "నదృష్ట" మన్న నుడి; నీ యవ్యాజ వాత్సల్య వ
ర్షదపాంగేక్షణ పక్షపాతమ "యదృష్టప్రాప్తి" సాయీశ్వరా!

౧౦౦

మాన్యంబైన పదంబువీడి, చెడి, దుర్మార్గంబులన్ ద్రొక్కి సౌ
జన్యంబేది, తపించి సుర్రిక్కు నను నీ సాన్నిధ్యమున్ జేర్చి తీ
హైన్యంబున్ దొలఁగింపఁజాలవెటు? నీ యాస్థానమం దెవ్వఁడేన్
దైన్యంబొందిన నీకు లాఘవముగాదా? సాయినాథప్రభూ!

౧౦౧

లోకంబందు ఋణానుబంధమునఁగల్గుఁ బ్రాణి సంయోగముల్
కాకేఁ గుక్కయునేనిఁ బిల్లియయినన్ గానీ మరే జీవియేఁ
సాకల్యంబు ఋణంబుఁ దీర్చికొనఁ బంచన్ జేరు, ఛీ కొట్టఁగా
నీకున్ బోలదటంచుఁ జెల్పితివి, తండ్రీ! సాయినాథప్రభూ!

౧౦౨

తెలివిన్దప్పనె యెప్పుడేనియు మహాధివ్యాధు లేపంగఁ; జం
చలతన్ గాంచునె కల్మి లేములకునై; స్వర్గాపవర్గంబులన్
దలఁపన్బోవునె? జంకునే మృతికి? వ్యర్థంబస్థిరంబైన కో
ర్కలకుంజిక్కునెఁ త్వద్పదాంకితుఁడు? తండ్రీ! సాయినాథప్రభూ!

౧౦౩

తనివిన్గూర్చని సంపదల్, హృదయమున్ దార్కాణఁగావించు భో
గ నికాయంబులు, నంత మెయ్యెడనెఱుంగన్రాని యీవిద్యలున్,
వెనుకన్ ముందునుగాననీని పదవుల్, వే భంగులౌ కర్మముల్,
నినుఁ జేర్పంగ సమర్థనీయములె? తండ్రీ! సాయినాథప్రభూ!

౧౦౪

ఏ యయ్యల్ ముదమారగానిడిరో నీకీపేరు! సుశ్రేయమై
ధ్యేయంబై, సకలార్థదంబయి, రసాధిష్ఠానమై, శ్రావ్యమై
హాయింగూర్చుఁ దలంచినన్ వినిన నోరారం జపింపంగ, నీ
'సాయీ' ద్వ్యక్షర మెల్లజీవులకు విశ్వంబందు, శీర్డీశ్వరా!

౧౦౫

హనుమ ధ్యానము, దత్త వందనము, కృష్ణాసక్తి, శ్రీరామ చిం
తన, మృత్యుంజయ మానసాభినుతి హత్తంజేసి యొక్కొక్క చో
ప్పున మున్నిన్ని యుఁకెన్నొ యన్నియగు రూపుల్దాల్చు నాదివ్యభా
గ్య నిధానంబయి నేడు వచ్చితిగదయ్యా! దేవ! సాయీశ్వరా!

౧౦౬

నిదురన్బొందెడి నన్ను మేల్కొలిపి నీ నిర్హేతుకప్రేమ కా
స్పదునిన్జేసి సముద్ధరించితివి, యీ సంబంధ మేనాటిదో
గదఁ న న్నత్యనుకంప నిందనుక సాకన్జాలు నిన్గూర్చి నా
యెడ సేవించుట యెట్లొ నే నెఱుఁగ సాయీ! భక్తచింతామణీ!

౧౦౭

బాబా! 'సాయి' పదంబు నీకతగు నన్వర్థాభిధానంబునై
ప్రాబల్యంబునుగాంచు నెల్లెడ సమర్థంబౌచు; సందేహ మే
లా? బీజాక్షర సంపుటీకరణ మాహాత్మ్యం బగమ్యంబు; స
త్తా బాహుళ్య మచింత్యమై పఱగు; నంతర్యామి! శిర్డీశ్వరా!

౧౦౮

ధనమా- నిన్నును నన్నుఁగూర్పఁగల బంధం బీ భవంబందు నేఁ
గనఁగాలేక ధనార్థినై నినుఁ గడుఁగారించి బాధించితిన్;
నినుఁగా కన్యముఁగోరఁ; నేడుగడవై నీవుండ నీ భోగభా
గ్య నిధానంబుల నేమిసార్థకము? రంగా! సాయినాథప్రభూ!

౧౦౯

దోసెండన్నముఁ బేదకీయఁ గలయుందున్, మెచ్చి, రూపాయలన్
దోసెండిచ్చితి వాధినంబునన; సాధుల్ పేదలౌ దీనులం
దాసక్తిన్గని, యే లవంబిడిన నాహా! యేమి నీమోద! మీ
నీ సందేశ మెఱుంగఁజేసితివి; తండ్రీ! సాయినాథప్రభూ!

౧౧౦

క్షమకరంగాని యఘంబు లేవి కలవో శ్రావ్య ప్రపంచంబు దూ
రముఁగావించి తొకింత యిందనుక; నార్యా! షష్ఠి సంపూర్తిఁ బే
రిమిఁ జేకూర్చుదు దూరమందునిచెదే దృశ్యప్రపంచంబు సై
తము? కానీయుము నీ యభీష్టము; సమర్థా! సాయినాథప్రభూ!

౧౧౧

శ్రౌత స్మార్త నియుక్తకర్మచయ మా సంపన్నులై లౌకిక
ఖ్యాతిన్ స్వర్గ సుఖానుభూతి మది నాకాంక్షించు ధీరాళి కా
ఖ్యాంతంబయ్యెఁగు గాక; పేదలకవేలా? నీదు నామద్వయీ
పోతంబే భవవార్ధి తారకము; బాబూ! సాయినాథప్రభూ!

౧౧౨

నీకున్ బ్రేమసమాన మీ జగతిఁ బ్రాణిశ్రేణిపై నేరి కే
యేకాలంబున నెట్టి తేగతిని నే యేమాత్ర మీఁజెల్లునో
నీకే వేద్యము; నీ రహస్యమును గంటిన్; నిన్నుఁగాదంచు నే
యాకేనిన్ గదలంగ నేడునుగదయ్యా! సాయిబాబా! ప్రభూ!

౧౧౩

ఎఱుఁగన్ జాలవటంచు దెల్పుదున యేమీ? చెప్పకోఁదగ్గ దే
నెఱుఁగన్ బల్కనయేన్ శమింపదుగదా! హృత్తాప; మట్లౌట-ని
త్తఱి నా యీనుడులన్వినంగదె యొకింతన్; ద్వారకామాయిమం
దిర! తాపత్రితయప్రణాశ! కరుణాబ్ధీ! కృష్ణసాయీ! ప్రభూ!

౧౧౪

తగ రూపంబిడి నిన్నరూపకుని నే ధ్యానించుచున్నాఁడ; నెం
చగ వాగ్బుద్ధులమించు నిన్నున్ బ్రవచించన్ జూతు నేమేమొ; స
ర్వగతున్ నిన్గనకే పొనర్చెదను తీర్థక్షేత్ర యాత్రల్; క్షమిం
పఁగదే యీ త్రివిధాపరాధములు; దేవా! సాయినాథప్రభూ!

౧౧౫

అరుదౌ నీకృప వీనిపైఁ బఱపి నీ యాస్థానమందొక్క కిం
కరుఁగాఁగొంటివి; నీ కృతుల్ పలుక నాజ్ఞాపించితీ నీద్వయీ
స్మరణంబే భవవార్ధి సంతరణమున్ సత్యంబైదన్ నిల్పు; నే
మఱనీకయ్య! నమస్కృతుల్; కృతినిఁగొమ్మా! సాయినాథప్రభూ!

౧౧౬

దొర! నీవ యాత్మ, వీ- ధునియే మనంబు
పరిజనుల్ ప్రాణముల్- వపువే గృహంబు
కల విషయోప భోగములె నీ పూజ,
తెలియ నిద్రయ_సమాధిస్థితి, రాజ!
పలు త్రిప్పటలు శుభాస్పద ప్రదక్షిణలు
పలికెడి పలుకులే భవ్య సంస్తుతులు
నెగడు నే నొనరించు నిఖిల కర్మంబు
లగు సాయి! నీదు సమారాధనంబు.

---

నేను కృతకృత్యుఁడను- ధన్యుఁడేన యగుదు,
హిత సముద్ధృతిఁ గనిరి నా పితరులెల్ల,
సాయినాథుండు నిజభక్త సహితుఁడగుచుఁ
జేరి నా కుటీరమున వసించు కతన.

జలనిధి జలములఁగొని, యా
జలనిధికిᳵ దర్పణం బొసంగునటుల నీ
పలికించిన పలుకులఁ గృతిఁ
బలికి సమర్పింతు, సాయిబాబా! కొనవే!

శ్రీ సాయీ స్మరణ సమాప్తము.

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు శ్రీ సాయీబాబా మహారాజునకు
జై! జై! జై!

శ్రీ సాయీబాబా పూజాస్తవములు
సర్వము, సంపూర్ణము.

ఓమ్ శ్రీ సాయీప్రసన్న! శ్రీ సాయీ సమర్థ!
శ్రీ సాయీనాథార్పణమస్తు!
ఓమ్ తత్ సత్

# సవరణ

| పుట. | పంక్తి. | ముద్రితము. | సవరణ. |
|---|---|---|---|
| 11 | 18 | ప్రభూ! ప్రభూ! | ప్రభూ! |
| 15 | 12 | వ్యాఘ్రంబునే | వ్యాఘ్రంబునేఁ |
| 20 (ఎడమ) | 18 | మహిమ్మ | మహిమ్న |
| 40 ,, | 18 | ప్రేమితాయ | ప్రేషితాయ |
| 46 ,, | 4 | బ్రహ్మమయందప్రే | బ్రహ్మమయంద్రప్రే |
| 49 | 9 | మోచ్చి | మోడ్చి |
| 66 | 5-6 | ........గడిగెద, తమ్ముల మిటవుగ నీ కంఠించెద | ........గడిగి, దేవ! కప్పురహారతిఁ దమ్ములమిడి |
| 68 | 8 | జేకొనఁదవే! | జేకొనఁగదవే! |
| 72 | 10 | నీదు దీను | నీ దీను |
| 73 | 13 | నెలవులలను | నెలవులను |
| 89 | 10 | దాసలు | దాసీలు |
| 91 | 4 | ఎఱుఁగలేమురా! | ఎఱుఁగలేరురా! |
| 93 | 11 | శ్రోతి | శ్రోత |
| 94 | 18 | నష్టమయి | వినష్టమయి |
| 97 | 15 | కనిపంప | కనిపింప |
| 99 | 14 | దుష్కృతుల | దుష్కృతుల |
| 101 | 10 | వస్తువులవో | వసులవో |
| 103 | 13 | ఏ భేతిఁ | ఏ భీతిఁ |
| 105 | 5 | నొరలు | నొరులు |
| ,, | 20 | పదాంబుజాశయము | పదాంబుజాశ్రయము |
| 108 | 5 | ఇది సత్యంబు | ఇది నిత్యంబు |
| 110 | 2 | జేతుగద! | జేయుదువు |
| 111 | 7 | యుంచుఁ గిం | యుంచుఁ గ్రిం |
| 114 | 3 | ఖ్యాంతంబయ్యెను | ఖ్యాతంబయ్యెను |

## ఈ రచయితచే రచింపఁబడిన గ్రంథములు – ముద్రితములు.

1 శ్రీమద్భగవద్గీతామృతము. (భగవద్గీతాశ్లోకములు- తెనుఁగుపద్యములు)
2 ప్రబోధసుధాకరము (శ్రీ శంకరభగవత్పాదులకృతికి ఆంధ్రీకృతి)
3 ఆశ్చర్యచూడామణి. (శ్రీరామచరిత్ర- నాటకము)
(శక్తిభద్రకవి రచిత సంస్కృతనాటకమున కాంధ్రానువాదము)

## శ్రీ సాయిలీలా ప్రచురణములు

1 శ్రీ సాయిబాబా పూజాస్తవములు (రెండవకూర్పు) 1–00
(సహస్రనామావళి, త్రికాలసేవలు, షిర్డిలో ప్రతినిత్యము జరుగు- ప్రభాతసేవ, మధ్యాహ్నసేవ, రాత్రిసేవ- గేయములు చేర్చఁబడినవి)
2 శ్రీకృష్ణకర్ణామృతము (భక్తలీలాశుక సంస్కృతకృతికి తెనుఁగు గీతములు. 1–00
3 శ్రీ సాయీ మననము 3 సర్గలు. 1–00
4 శ్రీ ఆపదుద్ధారక శతకము, శ్రీరామ కథాత్మకము. 0–50
5 శ్రీ సాయీ కరుణ 2–00
6 శ్రీ వేంకటేశ్వర సుప్రభాత గీతములు (రెండవకూర్పు) 0–25
7 శ్రీ సాయీబాబాకూడ దేవుఁడేనా? ఉన్న దేవుళ్ళుచాలకనా? (సందేహనివృత్తి) 1–00

## ముద్రణమునకు సిద్ధముగనున్నవి

8 ఏమీ, నిన్నుపేక్షింతునా? (శ్రీ సాయీబాబాచరిత్ర భక్తుల అనుభవములు) 3 భాగములు.
9 ప్రేమామృతము, (నారదభక్తిసూత్రములు, టీక, తెనుఁగుపద్యములు. వివరణ గీతమాలిక.)
10 శ్రీ సాయీ కబీరుసూక్తులు- (సాఖీలు-ద్విపద)
11 శ్రీ సాయీ విజయము, బాబాచరిత్ర జంగమకథ.
12 పుండరీకుని చరిత్రము, పండరిస్థల మాహాత్మ్యము.